శ్రీరస్తు.

# సుమతీశతకము

టీకాతాత్పర్యసహితము

మాదేటి సన్యాసయ్య,

ఆంధ్రాబుక్కుడిపో,

రాజమండ్రి.

1921

FIRST EDITION 1,000 COPIES.

**SCAPE & COMPANY,**

*RUBBER STAMP MAKERS & STATIONERS &c.*

**COCANADA.**

Price As 3



శ్రీరస్తు.

# సుమతిశతకము.

ప్రతిపదటీకాతాత్పర్యసహితము.



శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు ♦ నౌరాయనఁగా
ధారాళమైననీతులు
నోరూరగఁ జవులుపుట్ట ♦ నుడివెదసుమతీ.

టీ. సుమతీ = మంచిబుద్ధిగలవాఁడా, శ్రీరాముని దయచేతను = శ్రీరామునియొక్క కరుణచేత, ఆరూఢిగన్ = నిశ్చయముగా, సకలజనులును = జనులందరును, ఔరా = ఆశ్చర్యము, అనఁగాన్ = అనిచెప్పఁగా, ధారాళము = నిర్వివాదము, అయిననీతులు = అయినట్టినీతులను, నోరు—ఊరగన్ = నోటియందు జలము వానియందలి మిక్కిలి ఆసక్తికలుగ జేయునట్లని

తా. ఊరునట్లును, చవులు = రుచులు, పుట్టన్ = కలుగునట్లును, నుడివెదన్ = చెప్పెదను.

తా. మంచిబుద్ధిగలవాఁడా ! భగవంతుఁడైన శ్రీరామచంద్రమూర్తి దయచేసి సమస్తజనులును, బాగున్నావని చెప్పునట్లు నోటియందు నీరు ఊరునట్లు రుచులుపుట్టఁగా విస్తరించి నీతులను జెప్పుచున్నాను.

క. అక్కఱకు రానిచుట్టము
మ్రొక్కిన వర మీని వేల్పు ♦ మోహరమునఁ దా
నెక్కినఁ బాఱనిగుఱ్ఱము
గ్రక్కున విడువంగ వలయుఁ ♦ గదరా సుమతీ. 2

టీ. సుమతీ, అక్కఱకున్ = అవశ్యమైన కార్యమునకు, రానిచుట్టము = రానిబంధువును, మ్రొక్కినన్ = నమస్కరించినను, వరము = కోరికను, ఈని = ఇయ్యని. వేల్పున్ = దేవునిని, మోహరమునన్ = యుద్ధమునందు తాఁ = తాను, ఎక్కినన్ = ఎక్కఁగా, పాఱనిగుఱ్ఱమున్ = పాఱని = పరుగెత్తని, గుఱ్ఱము = గుఱ్ఱమును. గ్రక్కునన్ = శీఘ్రముగా, విడువంగ వలయుఁగదరా = విడిచిపెట్టవలయును గదా.

తా. మనకు సహాయము కావలసిన సమయమందు సాయమునకు రాని చుట్టమును, వేఁడుకొన్నను వరము నియ్యని దేవునిని, యుద్ధమునందు ఎక్కి స్వారిచేయఁగా పరుగెత్తని గుఱ్ఱమును, తోడనే విడువవలయును.

క. అడిగిన జీతం బియ్యని
మిడిమేలపుదొరను గొల్చి ♦ మిడుకుటకంటెన్
వడిగల యెద్దులఁ గట్టుక
మడి దున్నుక బ్రతుకవచ్చు ♦ మహిలో సుమతీ. 3

టీ. సుమతీ, అడిగినన్ = అడిగినప్పటికిని, జీతంబు = జీతమును, ఇయ్య...దొరను-ఇయ్యని = ఇయ్యనట్టి, మిడిమేలపు దొరను = మిడిసిపడున

ట్టిప్రభువును, కొల్చి = సేవించి, మిడుకుటకంటెన్ = కష్టములో బ్రతుకుట కంటెను, మహిలోన్ = భూమియందు వడి = బలము, గలయెద్దులన్ = గలిగినట్టియెద్దులను, కట్టుక = కట్టుకొని, (1 ఇచ్చట 'కట్టుక' అను ప్రయోగము అసాధువు) మడిన్ = పొలమును, దున్నుక = దున్నుకొని, (2 ఇదియును నసాధువే) బ్రతుకవచ్చున్ = జీవింపవచ్చును.

తా. అడిగినప్పటికిని జీతము నియ్యనిప్రభువును గొలుచుటకంటెను దున్నుకొని జీవించుటయే మేలు.

క. అడియాసకొలువుఁ గొలువకు
గుడిమణియము సేయఁ బోకు ♦ కుజనులతోడన్
విడువక కూరిమి సేయకు
మడవిని దోడరయ కొంటి ♦ యరుగకు సుమతీ. 4

టీ. సుమతీ, అడియాసకొలువు-అడియాస = వ్యర్థమైన యాశగలది-నిరర్థకమైన. కొలువున్ = కొలువును-సేవాప్రవృత్తిని, కొలువకు = చేయకుము, గుడిమణియము = దేవాలయమందలి అధికారమును, సేయన్ = చేయుటకు, పోకు = పోవకుము, కుజనులతోడన్ = దుర్జనులతోడ, విడువక = ఎడతెగక, కూరిమి = స్నేహము, చేయకుము, అడవిని = అడవియందు, తోడు = సహాయమును అరయక = విచారింపక-చెప్పుకొనక, ఒంటి = ఒంటరిగా. అరుగకు = పోకుము.

తా. నిరర్థకముగాఁ గొలుచుకొలువును, దేవాలయములోఁ జేయు మణియమును, దుర్జనులతో స్నేహమును, అడవిలో తోడులేక నడచుటయుఁ దగినవికావు.

క. అధరము గదలియుఁ గదలక
మధురము లగు భాష లుడిగి ♦ మౌనవ్రతుఁడై

నధికారరోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ • బాపము సుమతీ. 5

టీ. సుమతీ, అధరము = పెదవి, కదలియుఁ = ఆడియు, కదలక = ఆడక, మధురములు = తియ్యనివి, అగు, భాషలు = మాటలను, ఉడిగి = విడిచి, మౌనవ్రతుఁడు మౌన = మాటాడకుండుటయే, వ్రతుఁడు = వ్రతముగాఁగలవాఁడు, ఔ...శవముఁ ఔ = అగునట్టి, అధికార = అధికారము అనెడు, రోగ = రోగముచేత, పూరిత = నిండినవాఁడును, కావుననే, బధిర = చెవిటివాఁడును, అంధక = గ్రుడ్డివాఁడును, అగు, శవముఁ = పీనుఁగును-పీనుఁగుకు సాటియగువానిని అనుట, చూడఁ = చూచుట, పాపము = దోషము.

తా. అధికారముచే గర్వించియున్నవానికి కన్నులు గానవు; చెవులు వినవు. వాఁడు, పెదవిగదల్పఁడు కదల్చినను ఇంపుగా మాటలాడఁడు. కాఁబట్టి అట్టివాఁడు, కన్నులు తెలియక, చెవులు వినక, పెదవిగదల్పక, మాటాడనేరక యుండుపీనుఁగుకు సమానమేయగును. అట్టివానిని కన్నెత్తిచూచుట సైతము దోషమే.

క. అప్పు గొని చేయువిభవము
ముప్పునఁ బ్రాయంపుటాలు • మూర్ఖునితపముం
దప్పరయనినృపురాజ్యము
దెప్పరమై మీఁద గీడు • దెచ్చుర సుమతీ. 6

టీ. సుమతీ, అప్పు = ఋణమును, కొని = తీసికొని, చేయువిభవము = చేయునట్టివేడుకయు, ముప్పునన్ = ముసలితనమందు, ప్రాయంపు ఆలు = పడుచుపెండ్లమును, మూర్ఖునితపమున్-మూర్ఖుని = చదువులేనివానియొక్క- మూఢునియొక్క, తపమున్ = తపస్సును, తప్పు = నేరమును, అరయ

ని...రాజ్యము-అరయని = విచారింపని, నృపు = రాజుయొక్క, రాజ్యముఁ = దొరతనమును, దెప్పరమై = సహింపశక్యముకానిదై, మీఁదఁ = పిమ్మట, కీడు = చెరుగు, తెచ్చుర = కలిగించునుసుమా.

తా. అప్పుచేసి చేయు వేడుకయును, ముసలితనమందు పడుచు పెండ్లమును, తప్పును కనుగొనలేని ప్రభుత్వమును, అప్పటికే సహింపశక్యము కాకుండుటయే కాక పిదపను కీడు కలిగించును.

క. అప్పిచ్చువాఁడు వైద్యుఁడు
నెప్పుడు నెడతెగక పాఱు ♦ నేఱును ద్విజుఁడుం
జొప్పడినయూర నుండుము
చొప్పడ కున్నట్టియూరు ♦ సొరకుము సుమతీ. 7

టీ. సుమతీ - అప్పు = ఋణమును - ఇచ్చువాఁడు - వైద్యుఁడు = వైద్యుఁడును - ఎప్పుడుఁ = ఎల్లప్పుడును - ఎడతెగక = నడుమనుడుగక - పాఱు నేఱును - పాఱు = ప్రవహించునట్టి - ఏఱును = నదియును - ద్విజుఁడుఁ = బ్రాహ్మణుఁడును - చొప్పడినయూరఁ - చొప్పడిన = ఏర్పడియున్నట్టి - ఊరఁ = ఊరియందు - ఉండుము - చొప్పడక = అవియేర్పడక - ఉన్నట్టియూరుఁ = ఉండెడుఊరిని - చొరకుము = ప్రవేశింపకుము.

తా. అప్పునిచ్చువాఁడును - వైద్యుఁడును - ఎడతెగక జలము పాఱుచుండెడి నదియును - బ్రాహ్మణుఁడును లేనియూరును బ్రవేశింపనుగూడఁదగదు

క. అలుని మంచితనంబును
గొల్లనిసాహిత్యవిద్య ♦ కోమలినిజముం

బొల్లు నదంచినబియ్యముఁ
దెల్లని కాకులును లేవు ♦ తెలియుర సుమతీ. 8

టీ. సుమతీ - అల్లుని మంచితనంబును = అల్లుఁడు మంచివాఁడుగా నుండుట - గొల్లని సాహిత్యవిద్య - గొల్లని = గొల్లవానియొక్క - సాహిత్యవిద్య = భాషయందలి పదపదార్థముల విశేషజ్ఞానము - కోమలినిజము = ఆఁడుదానియొక్క యథార్థమును - ఆఁడుది నిజము చెప్పుటయు - పొల్లునఁ = పొలుపట్టనిధాన్యమునందు - దంచినబియ్యము = దంచఁగాఁగలిగిన బియ్యమును - పొల్లును దంచియెత్తినబియ్యమనుట - తెల్లని కాకులును - లేవు = కలుగవు - తెలియుర = తెలిసికొనుము.

తా. మంచియల్లుఁడును - విద్వాంసుఁడైన గొల్లవాఁడును - నిజముపలుకు స్త్రీయు - పొల్లును దంచి తీసిన బియ్యమును - తెల్లని కాకులును - లోకములో కలుగవు.

క. ఆఁకొన్నకూడె యమృతము
తాఁ బొందక నిచ్చువాఁడె ♦ దాత ధరిత్రిన్
సోఁకోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువ గలవాఁడె వంశ ♦ తిలకుఁడు సుమతీ. 9

టీ. సుమతీ - ఆఁకొన్నకూడె = ఆఁకలికొనినపుడు తిన్నయన్నమే - అమృతము = అమృతమువంటిది - తాఁకు = ఆటంకము - బొందక = చెందక - ఇచ్చువాఁడె = ఇచ్చునట్టివాఁడే - దాత = దానశీలుఁడు - ధరిత్రిన్ = భూమియందు - సోఁకు = శ్రమమును - ఓర్చువాఁడె = సహించువాఁడె - మనుజుఁడు = మనుష్యుఁడు - మనుష్యుఁడని చెప్పఁదగినవాఁడు - తేఁకువ = ధైర్యము - కలవాఁడె = కలిగినవాఁడే - వంశతిలకుఁడు = కులమునకు అలంకారమైనవాఁడు - కులశ్రేష్ఠుఁ డనుట.

తా. ఆఁకలిగానున్నపుడు తిన్నయన్నమే యమృతమువలె భోగ్యముగానుండును. అడిగినపుడు ఆటంకములేక యిచ్చుటయే దాతలక్షణము. కష్టములకు ఓర్చుకొనువాఁడె పురుషుఁ డనందగును. ధైర్యముగలవాఁడే తన వంశమునకు కీర్తిదెచ్చును.

క. ఆఁకలి యుడుగనికుడుపును
వేఁకటి యగులంజపడుపు ♦ విడువని బ్రతుకుం
బ్రాఁకొన్న నూతియుదకము
మేఁకలపాడియును రోఁత ♦ మేదిని సుమతీ. 10

టీ. సుమతీ - ఆఁకలి - ఉడుగని కుడుపును - ఉడుగని = మానని - కుడుపును = తిండియును - ఆఁకలితీఱనట్టి భోజనమనుట - వేఁకటి = గర్భముగలది - అగు - లంజె = ఉంపుడుఁగత్తెయొక్క - పడుపు = సంపాదన - విడువనిబ్రతుకున్ = వదలిపెట్టనిజీవనమును - గర్భము కలిగియున్నపుడు సంపాదించుబ్రతుకనుట - ప్రాఁకొన్న...దకము. ప్రాఁకొన్న = ప్రాఁతవడినట్టి-బహుకాలము వాడఁబడకుండునట్టి - నూతి = బావియొక్క - ఉదకము = నీళ్ళును - మేఁకలపాడియును - మేదినిన్ = భూమియందు - రోఁత = అసహ్యమైనవి.

తా. ఆఁకలితీఱనిభోజనమును - లంజ గర్భము కలిగియున్నను ఆర్జనము సేయుటయు - ప్రాఁతదైన బావినీళ్ళును - మేఁకలపాడియును రోఁతఁ బుట్టించునవి.

క. ఇచ్చునదె విద్య రణమునఁ
జొచ్చునదె మగతనంబు ♦ సుకవీశ్వరులున్
మెచ్చునదె నేర్పు వాదుకు
వచ్చునదే కీడు సుమ్ము ♦ వసుధను సుమతీ. 11

టీ. సుమతీ - వసుధను = భూమియందు - ఇచ్చునదె = ధనము ఇచ్చునట్టిదే - విద్య = విద్యయగును - రణమునన్ = యుద్ధమునందు - చొచ్చునదే = చొరబడునట్టిదే - మగతనంబు = పౌరుషము - సుకవీశ్వరులున్ = మంచి కవిశ్రేష్ఠులుకూడ - మెచ్చునదె = మెచ్చునట్టిదే - నేర్పు = సామర్థ్యము - వాదుకు = వివాదమునకు - తగవునకు - వచ్చునదే = వచ్చునట్టిదే - కీడు = చెఱుపు - చుమ్మీ = సుమా.

తా. ద్రవ్యమును ఆర్జింపఁజేయునదియే విద్య. యుద్ధమందుఁ జొచ్చుటయే మగతనము. మహాకవీశ్వరులును మెచ్చుకొనునట్టిదే సామర్థ్యము. తగవునకు వచ్చుటయే చెఱుపు.

క. ఇమ్ముగఁ జదువనినోరును
అమ్మా యని పిలిచి యన్న ♦ మడుగనినోరుం
దమ్ములఁ బిలువనినోరును
గుమ్మరి మను ద్రవ్వినట్టి ♦ గుంటర సుమతీ. 12

టీ. సుమతీ - ఇమ్ముగన్ = చక్కఁగా - చదువనినోరును = చదువనట్టినోరును - అమ్మా = ఓఅమ్మా - అని - పిలిచి - అన్నము = అన్నమును - అడుగనినోరును = అడుగనట్టినోరును - తమ్ములన్ = తమ్ములను - పిలువనినోరును = పిలువనట్టి నోరును - కుమ్మరి = కుమ్మరవాఁడు - మను = మన్నును - త్రవ్వినట్టిగుంటర = త్రవ్వినట్టిగొయ్యియగును - ఆపల్లముతో సాటియైనదనుట.

తా. చక్కఁగా చదువనివారినోరును, అమ్మా ! యని పిలిచియన్న మడుగనివారినోరును, తమ్ముఁడా! యని పిలువనినోరును, కుమ్మరవాఁడు మట్టిత్రవ్విన పల్లమువంటిదే యగును.

క. ఉడు ముండదె నూఱేండ్లును
బడి యుండదె పేర్మిఁ బాము ♦ పదినూఱేండ్లున్
మడువునఁ గొక్కెర యుండదె
కడు నిలఁ బురుషార్థపరుఁడు ♦ గావలె సుమతీ. 13

టీ. సుమతీ. ఉడుము, నూఱేండ్లును = నూఱుసంవత్సరములును, ఉండదె = ఉండదా-బ్రతుకదా యనుట, పాము, పేర్మిన్ = అతిశయముతో, పదినూఱేండ్లున్ = వేయేండ్లును, పడియుండదె = ఉపయోగము లేక పడియుండదా, మడువునన్ = మడుగునందు, కొక్కెర = కొంగ, ఉండదె = అన్నియేండ్లు ఉండదా, ఇలన్ = భూమియందు, కడున్ = మిక్కిలి, పురుషార్థపరుఁడు = మంచిపనులయందు ఆసక్తిగలవాఁడు, కావలెన్ = కావలయును.

తా. ఉడుము నూఱేండ్లు ఉండును. పాము వేయేండ్లు ఉండును. కొంగయు మడుగునందు బహుకాలము ఉండును. ఏండ్లు పూండ్లుగా ఉండినంతనే పనయేమి. పురుషార్థములను సాధించుటచేతనే ప్రయోజనము.

క. ఉత్తమగుణములు నీచున
కెత్తెఱఁగునఁ గలుగ నేర్చు ♦ నెయ్యెడలం 'దా'
నెత్తిచ్చి కరఁగి పోసిన
నిత్తడి బంగార మగునె ♦ యిలలో సుమతీ. 14

టీ. సుమతీ, నీచునకున్ = అల్పునకు, ఉత్తమగుణములు = మంచిగుణములు, ఎత్తెఱఁగునన్ = ఏరీతిగా, కలుగ నేర్చున్ = కలుగఁజాలును, ఎయ్యెడలన్ = ఏచోట్లనైనను, తాన్ = తాను, ఎత్తు = సరియెత్తు, ఇచ్చి,

కరఁగి = కరఁగించి, పోసినన్ = పోయంగా, ఇత్తడి = ఇత్తడియనునొకలోహము, బంగారము = బంగారు, అగునె = అగునా.

తా. బంగారము సరియైన్తు ఇత్తడిని కరఁగిపోసినను బంగారము కానేరదు. అట్లె నీచుఁడైనవానికి ఏమిచేసినను మంచివానిగుణములు కలుగవు.

క. ఉదకము ద్రావెడుహయమును
మదమున నుప్పొంగుచుండు ♦ మత్తేభంబున్,
మొదవుకడ నున్న వృషభముఁ
జదువనియానీచుకడకుఁ ♦ జనకుర సుమతీ. 15

టి. సుమతీ, ఉదకము = నీటిని, త్రావెడుహయమును = త్రాగునట్టి గుఱ్ఱమును గుఱించియును, మదమునన్ = మదముచేత, ఉప్పొంగుచుండు మత్తేభంబున్ = అతిశయించుచున్న మదపుటేనుఁగును గుఱించియును, మొదవుకడన్ = ఆవుదగ్గిఱ, ఉన్నవృషభమున్ = ఉన్నట్టి యెద్దునుగుఱించియును, చదువనియానీచుకడకున్ = చదువనట్టి నీచునిదగ్గిఱకును, చనకుర = పోకుము.

తా. నీరుత్రాగుచున్న గుఱ్ఱమునొద్దకును, మదము మిక్కిలి పట్టియున్న యేనుఁగునొద్దకును, ఆవుదగ్గిఱనున్న యెద్దుదగ్గిఱకును, చదువులేని యల్పునియొద్దకునుబోరాదు.

క. ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ ♦ విపరింపంగా
నపకారికి నుపకారము
నెప మెన్నక సేయువాఁడు ♦ నేర్పరి సుమతీ. 16

టీ. సుమతీ, ఉపకారికిన్ = మేలు చేసినవానికి, ఉపకారము = ప్రత్యుపకారమును, చేయుట = చేయుట, విపరీతము = వ్యత్యస్తము కాదు = కానేరదు, వివరింపంగాన్ = విచారించఁగా, అపకారికిన్ = చెఱుపు చేసినవానికి, నెపము = సాంకును, ఎన్నక = ఎంచక, ఉపకారము = మేలును, చేయువాఁడు, నేర్పరి = నేర్పుకలవాఁడు.

తా. మేలు చేసినవానికి బదులుమేలు సేయుట యొక విచిత్రముకాదు. కీడుచేసినవానికి వానిచెఱుపు తలంపక మేలునేయుటయే నేర్పరితనము.

క. ఉపమింప మొదలు తియ్యన
కపటం బెడనెడను జెఱకు ♦ కైవడినే పో
నెపములు వెదకును గడపటఁ
గపటపుదుర్జాతిపొందు ♦ గదరా సుమతీ. 17

టీ. సుమతీ, కపటపుదుర్జాతిపొందు = కపటము గలదుర్జనునిస్నేహము, ఉపమింపన్ = పోల్చిచూడఁగా, చెఱకుకైవడినేపో = చెఱకువిధము ననేసుమా, మొదలు = ఆరంభము, తియ్యన = తీఁపుకలది, ఎడనెడను = నడుమనడుమ, కపటంబు = వంకరగలది-వంచనగలది, కడపటన్ = చివరను, నెపములు = తప్పులను, వెదకునుగదరా = వెదకునుగదా.

తా. చెఱకు మొదలమొదల తీయగానుండి, మీదఁ నడుమ నడుమ తీపిలేక తుదకుఁ జప్పిడిగా పోవును. అట్లే దుర్జనునితోఁజేసినస్నేహము మొదట నింపుగాను వెనుక నపుడపుడు గడునుగాను నుండి కడపటచెఱుపు గలిగించును.

క. ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటికా మాటలాడి ♦ యన్యులమనముల్

నొప్పింపక తా నొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ♦ ధన్యుఁడు సుమతీ. 18

టీ. సుమతీ, ఎప్పటికి = ఏసమయమునకు, ఎయ్యది = ఏది, ప్రస్తుతము = చెప్పఁదగినదో, అప్పటికిన్ = ఆసమయమునకు, ఆమాటలు = దానికిఁదగినమాటలు, ఆడి = చెప్పి, అన్యులమనముల్ = ఒరుల మనస్సులు, నొప్పింపక = నొచ్చునట్లుచేయక, తాన్ = తాను, నొవ్వక = నొచ్చిపోక, తప్పించుక = తప్పించుకొని, తిరుగువాఁడు = సంచరించువాఁడు, ధన్యుఁడు = కృతార్థుఁడు.

తా. ఏసమయమున ఏది చెప్పఁదగునో అప్పటికి ఆమాటయేచెప్పి, ఒకరిని నొప్పింపక, తానునునొవ్వక, తప్పించుకొని సంచరించువాడేధన్యుడు.

క. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁ గూడ ♦ దది యెట్లన్నన్
సర్పంబుపడగనీడను
గప్ప వసించినవిధంబు ♦ గదరా సుమతీ. 19

టీ. సుమతీ, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, తప్పులు = దోషములను, వెదకెడున్ = వెదకునట్టి, అప్పురుషుని = అపురుషుని, కొల్వన్ = సేవించుట, కూడదు = తగదు, అది = ఆసేవింపఁగూడదనుట, ఎట్లు = ఎవిధము, అన్నన్ = అనఁగా,సర్పంబుపడగనీడను-సర్పంబు = పాముయొక్క,పడగ = పడగయొక్క, నీడను = నీడయందు, కప్ప = మండూకము, వసించినవిధంబు = నివసించినరీతి, కదరా = కదా.

తా. ఒకకప్ప తన్నుఁజంపునట్టి పాముయొక్క పడగనీడను చేరినయెడల ఎట్లో అట్లే ఒకఁడు తనయందుఁ దప్పులు ఎప్పుడును కనిపెట్టుచుండు పురుషుని కొలిచినయెడల మిక్కిలి హానిపొందును.

క. ఎప్పుడు సంపద గలుగును
నప్పుడె బంధువులు వత్తు ♦ రది యెట్లన్నం
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలు చేరుఁ ♦ గదరా సుమతీ. 20

టీ. సుమతీ - ఎప్పుడు = ఏసమయమునందు - సంపద = ఐశ్వర్యము - కలుగును = కలుగునో - అప్పుడె = ఆసమయముననే - బంధువులు = చుట్టములు - వత్తురు - అది = ఆవచ్చుట - ఎట్లు = ఏవిధము - అన్నన్ = అనఁగా - తెప్పలుగన్ = తెప్పదేలునట్లు - చెఱువు = తటాకము - నిండినన్ = నిండినయెడల - కప్పలు = మండూకములు - పదివేలు = అనేకములు - చేరునుకదరా = చేరునుగదా.

తా. చెఱువు పూర్ణముగా నిండియున్నప్పుడు తమంతకుతామే కప్పలు అనేకములు చేరునట్లు ఐశ్వర్యము కలిగినప్పుడు బంధువులు తామే చేర వత్తురు. సంపద లేనియెడల చుట్టములు రారని భావము.

క. ఏఱకుమీ కసుగాయలు
దూఱకుమీ బంధుజనుల ♦ దోషము సుమ్మీ
పాఱకుమీ రణమందున
మీఱకుమీ గురువులాజ్ఞ ♦ మేదినిసుమతీ. 21

టీ. సుమతీ - కసుగాయలు = పచ్చికాయలను - ఏఱకుమీ = ఏర్పఱపకుము - బంధుజనులన్ = చుట్టములను - దూఱకుమీ = నిందింపకుము - దోషముసుమ్మీ = దోషముసుమా - రణమందునన్ = యుద్ధమునందు - పాఱకుమీ = పరుగెత్తకుము - మేదినిన్ = భూమియందు - గురువులాజ్ఞ = గురువులయొక్క ఆజ్ఞను - మీఱకుమీ = అతిక్రమింపకుము.

తా. పచ్చికాయలను గోయరాదు - చుట్టములను నిందింపరాదు. యుద్ధమునందు ఓడిపారిపోరాదు. గురువులయాజ్ఞను అతిక్రమింపరాదు.

క. ఒకయూరికి నొకకరణము
నొకతీర్పరి యైనఁ గాక ♦ నొగిఁ దఱుచైనం
గకవికలు గాకయుండునె
సకలంబును గొట్టువడక ♦ సహజము సుమతీ. 22

టీ. సుమతీ - ఒకయూరికిన్ = ఒకగ్రామమునకు - ఒకకరణమును = ఒకకరణమువాఁడును - ఒకతీర్పరి = ఒకన్యాయాధిపతియును - ఒగిన్ = క్రమముగ - ఐనఁగాకన్ = అయినయెడలనేకాని - తఱుచు = అధికము - ఐనన్ = అయినయెడల - సకలంబును = అన్నియును - కొట్టువడక = చెడిపోకయే - కకవికలు = నానావిధములు - కాక = కాకుండక - ఉండునె = ఉండునా.

తా. ఒక్కొక్కయూరికి ఒక్కొక్కకరణమును ఒక్కొక్కన్యాయాధిపతియు నే యుండవలయును. కాని యనేకులు ఉండినయెడల అంతలి క్రమము లన్నియును దప్పి నానావిధములగు కలఁతలుపుట్టును.

క. ఒల్లనిసతి నొల్లనిపతి
నొల్లనిచెలి,కాని విడువ ♦ నొల్లనివాఁడే
గొల్లండు కాక ధరలో
గొల్లండును గొల్లఁ డౌనె ♦ గుణమున సుమతీ. 23

టీ. సుమతీ-ఒల్లనిసతిన్ = ఇష్టపడనిభార్యయును - ఒల్లనిపతిన్ = ఇష్టపడని యజమానుని - ఒల్లనిచెలికానిన్ = ఇష్టపడనిస్నేహితుని - విడువన్ = విడుచుటకు - ఒల్లనివాఁడే = ఇష్టపడనివాఁడే - గొల్లండు = గొల్ల

వాఁడు - కాక = కాని - ధరలోన్ = భూమియందు - గొల్లండును = గొల్ల వాఁడును - గుణమునన్ = గుణముచేత - గొల్లండు = గొల్లవాఁడు-ఔనె = అగునా ? కాఁడనుట.

తా. తన్నుఒల్లనిభార్యను, ప్రేమింపనియజమానుని, ఇష్టపడనిస్నేహితుని విడిచిపెట్టుటకు ఇష్టపడనివాఁడే గొల్లవాఁడు గాని జాతిచే గొల్లయైన వాఁడు గొల్లవాఁడుకాఁడు అనఁగా మూఢుఁడు-అనియు నర్థము.

క. ఓడల బండ్లును వచ్చును
ఓడలు నాబండ్లమీఁద ♦ నొప్పుగ వచ్చున్
ఓడలు బండ్లునువలెనే
వాడంబడుఁ గలిమి లేమి ♦ వసుధను సుమతీ. 24

టీ. సుమతీ - ఓడలన్ = ఓడలయందు - బండ్లును - వచ్చును - ఓడలును = వాపలును- బండ్లమీదన్ = బండ్లయందు, ఒప్పుగన్ = చక్కఁగా- వచ్చున్ = వచ్చును - ఓడలు = నావలును - బండ్లునువలెనే = శకటములు నువలెనే - వసుధను = భూమియందు - కలిమి = సంపదయుఁను - లేమి = దారిద్య్రమును - వాడంబడును = వాడఁబడును.

తా. ఓడలమీఁద బండ్లును - బండ్లమీఁద ఓడలును వచ్చునట్లే ఐశ్వర్యమువెంట దారిద్య్రమును-దారిద్ర్యమువెంట ఐశ్వర్యమును వచ్చుచుండును.

క. కడు బలవంతుం డైనను
బుడమిని బ్రాయంపుటాలిఁ ♦ బుట్టినయింటం
దడ వుండ నిచ్చెనేనియుఁ
బడుపుగ నంగడికిఁ దానె ♦ పంపుట సుమతీ. 25

టీ. సుమతీ - పుడమిన్ = భూమియందు - కడున్ = మిక్కిలి - బలవంతుండు = బలముకలవాఁడు - ఐనను = అయినప్పటికిని - ప్రాయంపుటాలిన్ = పడుచు పెండ్లామును - పుట్టినయింటన్ = పుట్టినయింటియందు - తడవు = చిరకాలము - ఉండనిచ్చెనేనియున్ = ఉండనిచ్చినయెడల - పడుపఁగన్ = అర్జించుటకుఁగాను - అంగడికిన్ = బజారునకు - తానే - పంపుట = పొమ్మని చెప్పుట.

తా. ఎంత బలముగలవాఁడయినను, ఎంతప్రాయము గల తన పెండ్లాము దానిపుట్టినింటనే చిరకాలము ఉండనిచ్చినయెడల దాని పరివర్తనమును తానే చెఱిపిన వాఁడగును.

క. కనకపుసింహాసనమున
శునకముఁ గూర్చుండఁ బెట్టి ♦ శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టము గట్టిన
వెనుకటిగుణ మేల మాను ♦ వినురా సుమతీ. 26

టీ. సుమతీ, కనకపుసింహాసనమున్ = బంగారపుగద్దియయందు, శునకమున్ = కుక్కను, కూర్చుండఁబెట్టి = కూర్చుండునట్లుచేసి, శుభలగ్నమునన్ = మంచిలగ్నమువందు, ఒనరఁగన్ = ఒప్పునట్లుగా, పట్టమున్ = బంగారపుపట్టెడ్డకును, కట్టినన్ = కట్టినప్పటికిని-పట్టాభిషేకము చేసినను అనుట. వెనుకటిగుణము = మునుపటి గుణమును, ఏల = ఎందుకు, మానున్ = విడిచిపెట్టును, వినురా = వినుము.

తా. మంచిలగ్నమునందు కుక్కను సింహాసనమునఁ బట్టాభిషేకము చేసి కూర్చుండఁబెట్టినను, దానికి సహజమయిన యల్పగుణమును అది మానని యట్లే నీచుఁడయినవానిని ఎంతగౌరవించినను వాఁడు తన నీచగుణమును మానఁడు.

క. కప్పకు నొరగాలైనను
సర్పమునకు రోగమైన ♦ సతి తులువైనన్
ముప్పున దరిద్రుఁడైనను
దప్పదు మఱి దుఃఖ మగుట ♦ తథ్యము సుమతీ. 27

టీ. సుమతీ, కప్పకున్, ఒరగాలు = కుంటికాలు, ఐనను = అయినను సర్పమునకున్ = పామునకు, రోగము = వ్యాధి, ఐనన్ = అయినప్పటికిని, సతి = పతివ్రతగాని యిల్లాలు, తులువ = దుర్మార్గురాలు, ఐనన్ = అయినను ముప్పునన్ = ముసలితనమునందు, దరిద్రుఁడు = అభాగ్యుఁడు, ఐనన్ = అయినప్పటికిని, మఱి = అధికముగా, దుఃఖము = వ్యసనము, అగుట = కలుగుట, తప్పదు = తప్పఁబోదు, తథ్యము = నిజము.

తా. కాలు కుంటియయిన కప్పయును, వ్యాధినొందినపామును, గయ్యాళియైన పెండ్లమును, ముసలితనమున దారిద్ర్యము నొందినవాఁడును, తప్పక దుఃఖము బొందుదురు.

క. కమలములు నీటఁ బాసినఁ
గమలాప్తునిరశ్మిసోఁకి ♦ కమలినభంగిన్
దమతమ నెలవులు దప్పినఁ
దమమిత్రులె శత్రులౌట ♦ తథ్యము సుమతీ. 28

టీ. సుమతీ, కమలములు = తామరలు, నీటన్ = జలమును, పాసినన్ = విడిచినయెడల, కమలాప్తునిరశ్మి = సూర్యకిరణము, సోఁకి = తగిలి, కమలినభంగిన్ = వాడిపోయినవిధముగా, తమతమ నెలవులు = తమతమ ఉనికిపట్టులు, తప్పినన్ = విడిచిపెట్టినయెడల, తమమిత్రులె = తమతమస్నేహితులు, శత్రులు = విరోధులు, ఔట = అగుట, తథ్యము = నిజము.

తా. తామరపుష్పములు తమస్థాన మగునీటిని వదలినయెడల తమకుఆప్తుడయిన సూర్యకిరణములచేతనే వాడిపోవునట్లు, ఎవరుగాని తమతమస్థితులు తప్పినయెడల వారిస్నేహితులుకూడ వారికి విరోధులగుటనిజము.

క. కరణము గరణము నమ్మిన
మరణాంతక మౌను గాని ♦ మనలేఁడు సుమీ
కరణము దనసరికరణము
మఱి నమ్మక మర్మ మీక ♦ మనవలె సుమతీ. 29

టీ. సుమతీ, కరణము = గ్రామపులెక్కలను వ్రాయువాఁడు, కరణము - మఱొక లెక్కలువ్రాయువానిని, నమ్మినన్ = నమ్మినయెడల, మరణాంతకము = ప్రాణాపాయమయిన ఆపద, ఔను గాని = అగునుకాని, మనలేఁడు సుమీ = బ్రదుకలేఁడుసుమా, కరణము = లెక్కలువ్రాయువాఁడు, తనసరి కరణమున్ = తనతో సాటియగు లెక్కలువ్రాయువానిని, నమ్మక = విశ్వసింపక, మర్మము = రహస్యమును, ఈక = ఇయ్యక - తెలుపక, మనవలెన్ = బ్రదుకవలెను.

తా. గ్రామకరణము మఱియొకకరణమును నమ్మినయెడల ప్రాణాంతకమయినఆపదను బొందునేకాని తప్పించుకొని బ్రదుకలేఁడు. కనుక కరణము తనవలెనే కరణముయినవానిని నమ్మక తనమర్మమును వానికి చెప్పక జీవింపవలయును.

క. కరణముల ననుసరింపక
విరసంబునఁ దిన్నతిండి ♦ వికటించుఁ జుమీ
యిరుసునఁ గందెనఁ బెట్టక
పరమేశ్వరుబండి యైనఁ ♦ బాఱదు సుమతీ. 30

టీ. సుమతీ, కరణములన్ = లెక్కలువ్రాయువారలను, అనుసరింపక = ఆశ్రయింపక, విరసంబునన్ = విరసము చేసి-వారితో అనుకూల్యము లేక తిన్నతిండి = భుజించిన యన్నము, వికటించున్ చుమీ = దేహములో యిముడకపోవును సుమా, ఇరుసునన్ = ఇరుసునందు, కందెనన్ = కాటుకను, పెట్టక = ఉంపక-ఉంపనియెడల, పరమేశ్వరుబండియయినన్ = పరమేశ్వరునియొక్క బండియయినప్పటికిని, పాఱదు = పరుగిడదు.

తా. పరమేశ్వరుని బండియయినను ఇరుసులో కందెన పెట్టనియెడల పోవనియట్లే, కాఁపులు కరణము వానిని అనుసరింపనియెడల తాము సుఖముగా అనుభవింపఁజాలరు.

క. కరణము సాధై యున్నను
  గరి మద ముడిగినను బాము ♦ గఱవక యున్నన్
  ధరఁ దేలు మీటకున్నను
  గర మరుదుగ లెక్కగొనరు ♦ గదరా సుమతీ. 31

టీ. సుమతీ, కరణము = గ్రామపులెక్కలువ్రాయువాఁడు, సాధు = యోగ్యుఁడు, ఐ = అయి, ఉన్నను = ఉండినను, కరి = ఏనుఁగు, మదము = మదమును, ఉడిగినను = విడిచినను, పాము = సర్పము, కఱవక = కొఱకక, ఉన్నన్ = ఉండినను, ధరన్ = భూమియందు, తేలు = వృశ్చికము, మీటక = కొండితో పొడువక, ఉన్నన్ = ఉండినను, కరము = మిక్కిలి, అరుదుగన్ = ఆశ్చర్యముగా, లెక్కకొనరు = లక్ష్యము చేయరు, కదరా = కదా.

తా. ఖండితము లేని కరణమువానిని, మదము లేని యేనుఁగును, కఱవని పామును, కుట్టని తేలును, లోకులు లక్ష్యము సేయరు.

క. కసుగాయఁ గఱచి చూచిన
మసలక తనయొగరు గాక ♦ మధురం బగునా
పస గలుగుయువతు లుండఁగఁ
బసిబాలలఁ బొందువాఁడు ♦ పశువుర సుమతీ. 32

టీ. సుమతీ, కసుగాయన్ = పచ్చికాయను, కఱచిచూచినన్ = కొఱికిచూడఁగా మసలక = ఆలస్యములేక, తనయొగరు = తనదయినవగరు, కాక = కానిదై, మధురంబు = తియ్యనిది, అగునా = అవునా - కానేరదనుట, పస = ప్రయోజనము, గలుగుయువతులు = కలయట్టి యౌవనస్త్రీలు. ఉండఁగన్ = ఉండఁగా, పసిబాలలన్ = మిక్కిలి పసివారగు బాలికలను, పొందువాఁడు = అనుభవించువాఁడు, పశువుర = పశువేయగును - పశువుతో సమానుఁడు, మూఢుడనుట.

తా. పండినపండును భక్షించిననే తియ్యఁగానుండును గాని పచ్చికాయను కొఱికి చూచినంత వగరుగానే యుండును. ఇట్లే మంచియౌవనముగల స్త్రీలతో అనుభవించిననే సుఖముగాని పసిబాలికలతో అనుభవించుట మోటుతనమే యగును.

క. కవి గానివానివ్రాఁతయు
నవరసభావములు లేని ♦ నాతులవలపుం
దవిలి చనుపంది నేయని
వివిధాయుధకౌశలంబు ♦ వృథరా సుమతీ. 33

టీ. సుమతీ, కవి = కవిత్వము చెప్పువాఁడు, కానివానివ్రాఁతయున్ = కానట్టి వానియొక్క వాక్యరచనమును, నవరసభావములు = శృంగారాదినవరసములును వానిభావములు, లేని = లేనట్టి, నాతుల = స్త్రీలయొ

క్కి, నలపుక్ = మోహమును, తరిగి = తగిలి - కనఁబడి, చనుపండిక్ = పో వుచున్న పండిని, ఏయని ఓకధాయుధకౌశలంబు = వేయని నానావిధముల యిన బాణములయందలి నేర్పు, వృథరా = వ్యర్థమునుమా.

తా. కవిగానట్టివాఁడు చేసిన రచనయు, నవరసములును వానిభావ ములును ఎఱుఁగలేని స్త్రీలమోహమును, దాడికి తప్పిపోయినపంఁదిని వేయఁ జాలనివాని బాణవిద్యయందలి నేర్పును వ్యర్థములు.

క. కాదు సుమీ దుస్సంగతి
పోదు సుమీ కీర్తికాంత ♦ పొందినపిదపక్
వాదు సుమీ యప్పిచ్చుట
లేదు సుమీ సతులవలపు ♦ లేశము సుమతీ. 34

టీ. సుమతీ, దుస్సంగతి = దుర్జనస్నేహము, కాదుసుమీ = కూడదు సుమా, కీర్తి కాంత = కీర్తి యనియెడు స్త్రీ-పొందినపిదపక్ = పొందినపిమ్మట - పోదుసుమీ = తొలఁగిపోదుసుమా - అప్పు = ఋణమును - ఇచ్చుట - వాదుసుమీ = రచ్చసుమా - తగవునకుమూలము అనుట-సతులవలపు = స్త్రీల మోహము - లేశము = కొంచమయినను - లేదుసుమీ = ఉండునది కాదు సుమా.

తా. దుష్టులతోడి స్నేహముతగదు. సంపాదించిన కీర్తి తొలఁగిపో దు. అప్పునిచ్చుట కలహమునకు మూలము. స్త్రీలప్రేమ యథార్థముకాదు.

క. కాముకుఁడు దనిసి విడిచిన
కోమలిఁ బరవిటుఁడు గవయఁ ♦ గోరుటయెల్లం
బ్రేమమునఁ జెఱకుపిప్పికిఁ
జీమలు వెస మూఁగినట్లు ♦ సిద్ధము సుమతీ. 35

టీ. సుమతీ, కాముకుఁడు = ఒక స్త్రీని కామించినవాఁడు- తనివి = తృప్తి నొందె - తృప్తి కలుగునట్లు గా అనుభవించియనుట- విడిచినకోమలిన్ = విడిచిపెట్టినట్టి స్త్రీని-పరటుఁడు = మఱియొక్క విటుఁడు- కవయన్ = పొందుటకు - కోరుటయెల్లన్ = ఆశపడుటయంతయు - చెఱకుపిప్పికి = రసముపిడిచికొనఁగా మిగిలిన చెఱకుయొక్క పిప్పికి - చీమలు - ప్రేమమునన్ = ప్రీతితో - మూఁగినట్లు = ముసురుకొన్నట్లు - సిద్ధము = ఇదితప్పనిది

తా. ఒక కాముకుఁడు తాను తృప్తి గలుగునట్లుగా అనుభవించి విడిచినస్త్రీని మఱియొక విటకాఁడు అనుభవింపఁగోరుట - చెఱకునరసమును పిడిచికొనఁగా మిగిలినపిప్పికి చీమలు ఆశతో ముసరికొన్నట్లు నీరసమే యగును.

క. కారణము లేనినగవును
బేరణమును లేని లేమ ♦ పృథివీస్థలిలోఁ
బూరణము లేనిబూరెయు
వీరణములు లేనిపెండ్లి ♦ వృధ రా సుమతీ. 36

టీ. సుమతీ - కారణము = నిమిత్తము - లేనినగవును = లేనట్టినవ్వును పేరణమున్ = ఱవికయు - లేనిలేమ = లేని యాఁడుదియును - పృథివీస్థలిలోన్ = భూమియందు - పూరణము = పప్పుముద్ద - లేనిబూరెయున్ = లేనటువంటి బూరెయును - వీరణములు = వాద్యములు - లేనిపెండ్లి = లేని వివాహము - వృథరా = వ్యర్థముగదా.

తా. కారణములేనినవ్వును - రవికలేని యాఁడుదియు - పూరణము పెట్టని బూరెయు - వాద్యములేని పెండ్లియు వ్యర్థములు.

క. కులకాంతతోడ నెప్పుడుఁ
గలహింపకు వట్టితప్పు ♦ ఘటియింపకుమీ
కలకంఠికంటఁ గన్నీ
రొలికిన శిరి యింట నుండ ♦ నొల్లదు సుమతీ. 37

టీ సుమతీ - ఎప్పుడుఁన్ = ఎప్పటికిని - కులకాంతతోడన్ = భార్యతో - కలహింపకు = కలహము చేయకుము - వట్టితప్పున్ = లేని నేరమును ఘటియింపకుమీ = మోపకుము - కలకంఠికంటన్ = స్త్రీయొక్క కంటి నుండి - కన్నీరు = భాష్పములు - ఒలికినన్ = పడినట్లయిన - సిరి = లక్ష్మి-ఇంటన్ = ఇంటియందు - ఉండన్ = ఉండుటకు - ఒల్లదు = ఇష్టపడదు.

తా. ఎప్పుడును భార్యతో జగడమాడకుము. అందువలన ఆమె దుఃఖించి కన్నీరు పడినయెడల ఇంటియందు సంపదయుండదు.

క. కూరిమి గలదినములలో
నేరము లెన్నఁడును గలుగ ♦ నేరవు మఱి యా
కూరిమి విరసంబైనను
నేరములే తోఁచుచుండు ♦ నిక్కము సుమతీ. 38

టీ. సుమతీ - కూరిమి = స్నేహము - కలదినములలోన్ = ఉన్నట్టు వంటిదినములయందు - నేరములు = తప్పులు - ఎన్నఁడున్ = ఎప్పుడును - కలుగనేరవు = తోఁపవు; మఱి- ఆకూరిమి = ఆస్నేహము- విరసంబైనను = విరోధమైనను - నేరములే = తప్పులే - తోఁచుచుండున్ = కలుగుచుండును- నిక్కము = నిజము.

తా. ఒకరొకరికి చెలిమి కలిగియున్నప్పుడు ఏతప్పును దప్పుగాఁ దోఁపదు. ఆచెలిమి విరోధమైన సర్వమును తప్పుగానే తోఁచుచుండును.

క. కొంచెపునరు సంగతిచే
నంచితముగఁ గీడు వచ్చు ♦ నది యెట్లన్నన్
గించిత్తు నల్లి కఱచిన
మంచమునకుఁ బెట్లు వచ్చు ♦ మహిలో సుమతీ. 39

టీ. సుమతీ. మహిలోన్ = భూమియందు, కొంచెపునరుసంగతిచేన్ = నీచుని స్నేహముచేత, అంచితముగన్ = ఒప్పునట్లుగా, కీడువచ్చున్ = చెడుపువచ్చును, అది-, ఎట్లనన్ = ఎలాగనఁగా, కించిత్తునల్లి = చిన్ననల్లి, కఱచినన్ = కొఱికినయెడల, మంచమునకు, పెట్లు = దెబ్బలు, వచ్చున్ = కల్గును.

తా. చిన్న నల్లి కఱచినచో, ఏవిధముగా మంచమునకు దెబ్బలు కలుగునో, ఆరీతిగా అల్పునితో స్నేహము చేసినవారికి చెఱుపు కలుగును.

క. కొక్కోకమెల్లఁ జదివిన
జక్కనివాఁడైన రాజ ♦ చంద్రుఁడైనన్
మిక్కిలి రొక్కము లీయక
చిక్కదురా వారకాంత ♦ సిద్ధము సుమతీ. 40

టీ. సుమతీ, కొక్కోకము = రతి శాస్త్రము, ఎల్లన్ = అన్నిటిని, చదివినన్ = చదివినను, చక్కనివాఁడైనన్ = చూపరియైనను, రాజ

చంద్రుఁడైనన్ = రాజశ్రేష్ఠుండైనను, మిక్కిలిరొక్కములు = ఎక్కువైన ధనము ఈయక = చిక్కఁడు, వారకాంత = వేశ్య, సిద్ధము = నిశ్చయము.

తా. అధిక ధనము నిచ్చువానిని వేశ్య వలచునేకాని, రతిశాస్త్రజ్ఞుని, చూపరిని వలవదు,

క. కొఱగానికొడుకు పుట్టినఁ
గొఱగామియె కాదు తండ్రి ♦ గుణములఁ జెరుచున్
జెఱకుతుద వెన్ను పుట్టినఁ
జెఱకున దీపెల్లఁ జెఱుచు ♦ సిద్ధము సుమతీ. 41

టీ. సుమతీ, కొఱగాని కొడుకు = నిరర్థకుఁడయిన కుమారుఁడు, పుట్టినన్ = జన్మించినయెడల, కొఱగామియె కాదు = నిరుపయోగమే కాక, తండ్రి గుణములన్ = తండ్రియొక్కగుణములను, (కూడ) చెఱుచున్ = పాడుచేయును, చెఱకుతుదన్ = చెఱకుకొనయందు, వెన్ను = కంకి, పుట్టినన్ = కలిగినయెడల, చెఱకునన్ = చెఱకునందు, తీపు = తియ్యఁదనము, ఎల్లన్ = అంతయును, చెఱుచున్ = పోగొట్టును, సిద్ధము = (ఇది) నిజము,

తా. చెఱకుకొనయందు వెన్నుబుట్టి యెట్లు ఆచెఱకునందలి తీపును కూడఁ బాడుచేయునో, అట్లు నిరర్థకుఁడయిన పుత్రుఁడు పుట్టి వాఁడు నిష్ప్రయోజకుఁడగుటయే కాక, తన తండ్రిగుణములనుగూడ చెఱుచును.

క. కోమలి విశ్వాసంబును
బాములతోఁ జెలిమి యన్య ♦ భామల వలపున్
వేముల తియ్యదనంబును
భూమీశుల నమ్మికలును ♦ బొంకుర సుమతీ. 42

టీ. సుమతీ, కోమలి = స్త్రీయొక్క, విశ్వాసంబును = చెలిమియు పాములతోఁ = సర్పములతో, చెలిమి = స్నేహమును, అన్యభామలవలపుఁ = పరస్త్రీలప్రేమయును. వేములతియ్యదనంబును = వేపచెట్లయొక్క తీపును, భూమీశులనమ్మికలును = రాజులయొక్క విశ్వాసములును, బొంకుర = అబద్ధముగదా.

తా. ఆఁడుదాని నమ్మకమును, పాముతోటి చెలిమియును, పరస్త్రీల ప్రేమయును, వేపచెట్టుయొక్క తీపును, రాజులవిశ్వాసమును అబద్ధములు.

క. గడన గలమగనిఁ జూచిన
నడుగడుగున మడుగు లిడుదు ♦ రతివలు దమలో
గడ నుడుగు మగనిఁ జూచిన
నడపీనుఁగు వచ్చె ననుచు ♦ నగుదురు సుమతీ. 43

టీ. సుమతీ, గడన = సంపాదనము, కల = కలిగిన, మగనిఁ = పతిని, చూచినఁ = చూచినయెడల, అడుగడుగునన్ = ఒక్కొక్క అడుగునకు గ్రింద, (అనగా వెంటవెంటనే) మడుగులు = వస్త్రపుమడుపులను, (శేవ) ఇడుదురు = ఉంగుదురు, గడన = సంపాదనము ఉడుగుమగనిఁ = లేనిభర్తను చూచినఁ = చూచినచో, నడపీనుఁగు = నడచునట్టి శవము, వచ్చెఁ = వచ్చెను, అనుచు = అనిచెప్పుచు, అతివలు = స్త్రీలు, నగుదురు = నవ్వుదురు.

తా. స్త్రీలు సంపాదనముగల పతిని గాంచినయెడల, మిగుల శుశ్రూష చేయుదురు- సంపాదనములేనిభర్తనుఁ జూచినయెడల నడచునట్టి శవము వచ్చెననుచు పరిహాసము చేయుదురు.

క. చింతింపకు కడచినపని
కింతులు వలతు రని నమ్మ ♦ కెంతయు మదిలో

నంతఃపుర కాంతలతో
మంతనములుమానుమిదియె ♦ మతముర సుమతీ. 44

టీ. సుమతీ, కడచినపనికిన్ = జరిగిపోయినకార్యమునకు, చింతింపకు = విచారముఁబొందకు, ఇంతులు = స్త్రీలు, వలతురుఅని = విశ్వసింతురని, మదిని = మనస్సునందు, ఎంతయున్ = ఎంతమాత్రమును, నమ్మకు = విశ్వసింపకుము, అంతఃపురకాంతలతోన్ = రాణివాసస్త్రీలతో, మంతనములు = రహస్యప్రమాటలు, మానుము = వదలుము, ఇదియే = ఇదే, మతముర = మతము గదా.

తా. జరిగిపోయిన పనికి విచారపడుట తగదు. స్త్రీలు ప్రేమింతురన్న ఇంచుకంతయు నమ్మకుము. రాణివాసస్త్రీలతో రహస్యాలోచనములు సలుపకుము.

క. చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు ♦ పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁ బెట్టిన
భూమీశులపాలఁ జేరు ♦ భువిలో సుమతీ. 45

టీ. సుమతీ, భువిలో = భూమియందు, చీమలు = పిపీలికములు, పెట్టిన, పుట్టలు = వల్మీకములు, పాములకు = సర్పములకు, ఇరవు = తావు, ఐనయట్లు = ఐనరీతిగా, పామరుఁడు = మూఢుఁడు, హేమంబున్ = బంగారమును, కూడబెట్టిన = చేర్చిన, భూమీశులపాలన్ = రాజులవశమున, చేరున్ = చేయను.

తా. చీమలు పెట్టిన పుట్టలు సర్పములకు నెలవయినట్లు లోభి చేర్చిపెట్టిన ధనము రాజులపాలగును.

కం. చుట్టములు గానివారలు
చుట్టములము నీకటంచు ♦ సొంపు దలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు గలుగఁ ♦ గదరా సుమతీ. 46

టీ. సుమతీ, చుట్టములు గానివారలు = బంధువులు గానివారలు, గట్టిగ, ద్రవ్యంబుగలుగన్ = ధనము చేరఁగానే, చుట్టములము = బంధువులము, నీకటంచు = నీకనుచు, సొంపు = సంతోషము, తలిర్పన్ = ఒప్పునట్లుగా, నెట్టుకొని = బలత్కారముగా, ఆశ్రయింతురు = అనుసరింతురు, కద రా = కాదా.

తా. బంధువులు కానివారలుసయితము ధనము చేరినప్పుడు బలాత్కారముగా మేము నీకు బంధువులమని వచ్చి చేరుదురు.

కం. చేతులకుఁ దొడవు దానము
భూతల నాథులకుఁ దొడవు ♦ బొంకమి ధరలో
నీతియు తొడ నెవ్వారికి
నాతికి మానంబు తొడవు ♦ నయముగ సుమతీ. 47

టీ. సుమతీ, చేతులకు = హస్తములకు, దానము = ఈవి, తొడవు = ఆభరణము, భూతలనాథులకున్ = రాజులకు, బొంకమి = అబద్ధముచెప్పకుండుటయే, తొడవు = ఆభరణము, ధరలోన్ = భూమియందు, ఎవ్వారికిన్ = యెట్టివారికిని, నీతియ = న్యాయమె, తొడవు = భూషణము, నాతికి = స్త్రీకి, మానంబు = పాతివ్రత్యమే, తొడవు = భూషణము.

తా. చేతులకు దానమును, రాజులకు అనృతమాడకుండుటయును, స్త్రీలకు పాతివ్రత్యమును, న్యాయమే యెల్లవారికిని ఆభరణములు.

క. తడవోర్వక యొడలోర్వక
కడువేగం బడచిపడినఁ ♦ గార్యం బగునే
తడవోర్చిన నొడలోర్చినఁ
జెడిపోయిన కార్యమెల్లఁ ♦ జేకుఱు సుమతీ. 48

టీ. సుమతీ, తడవు = ఆలస్యమును, ఓర్వక = ఓర్వలేక, ఒడలోర్వక = శరీరశ్రమకునోర్వక, కడువేగము = అతివేగముగా, అడచిపడినన్ = మిక్కిలిపడినయెడల, కార్యంబు = పని, అగునే = అగునా? తడవు = ఆలస్యమును, నోర్చినన్ = ఓర్చినయెడల, ఒడలోర్చిన = శరీరమునోర్చిన, చెడిపోయిన కార్యమెల్లన్ = చెడిపోయిన కార్యమంతయును, చేకుఱున్ = సమకూడును.

తా. ఆలస్యమునకును, దేహశ్రమకును సహింపక తొందరపడినయెడల యేకార్యమును గానేరదు. ఆలస్యమును దేహప్రయాసమును కోర్చుకొన్నయెడల చెడిపోయిన పనులన్నియు సమకూడివచ్చును.

క. తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకురక్ష ♦ దయ చుట్టంబౌఁ
దనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు ♦ తథ్యము సుమతీ. 49

టీ. సుమతీ, తనకోపమె = తనక్రోధమే, తనశత్రువు = తనకు పగవాఁడు, తనశాంతమె = తననెమ్మదే, తనకురక్ష = తన్నురక్షించునట్టి దగును, దయ = కరుణ, చుట్టంబౌ = బంధువగును- తనసంతోషమె = తన కుతూహలమే, స్వర్గము = దేవలోకము, తనదుఃఖమె = తనచింతయే, నరకము = యమలోకము, అండ్రు = చెప్పుదురు, తథ్యము = నిజము.

తా. శత్రువువలె తనకోపమే తన్ను బాధించును. తననెమ్మదే తన్ను

రక్షకునివలె కాపాడును. తనదయయే చుట్టమువలె ఆదరించును. తన సంతోషమే స్వర్గమువలె సుఖమునిచ్చును. తనచింతయే నరకమువలె వేధించును; (అని చెప్పుదురు)

క. తనయూరి తపసితనమును
దనపుత్త్రుని విద్యపెంపుఁ ♦ దన సతిరూపుం
దన పెరటిచెట్టు మందును
మనసునఁ వర్ణింప రెట్టి ♦ మనుజులు సుమతీ. 50

టీ. సుమతీ, తనయూరి = తనగ్రామమందుండునట్టి, తపసితనమును = తానుజేయుతపోనిష్ఠయు, తనపుత్త్రుని = తన కొమారునియొక్క, విద్యపెంపుఁ = విద్యాకౌశలమును, తనసతిరూపుఁ = తన భార్యయొక్క సౌందర్యమును, తన పెరటిచెట్టు మందును = తనతోటలోనుండునట్టి చెట్టు మందును, ఎట్టిమనుజులు = ఎటువంటివారు, ఐనను- మనసునన్ = మనస్సునందు, వర్ణింపరు = మెచ్చుకొనరు.

తా. తనయూరిలో నొకఁడు చేయుతపస్సును, తనకొమారునివిద్యాధిక్యమును, తనభార్యయొక్క సౌందర్యమును తనతోటలోని ఔషధమును, ఎటువంటివారయినను కొనియాడరు.

క. తనకలిమి యింద్రభోగము
తన లేమియె సర్వలోక ♦ దారిద్ర్యంబౌ
తనచావు జలప్రళయము
తనవలచినయదియె రంభ ♦ తథ్యము సుమతీ. 51

టీ. సుమతీ, తనకలిమి = తనభాగ్యము- ఇంద్రభోగము = దేవేంద్రునిపదవితో సమానమయినది- తనలేమియె = తనపేదఱికమే- సర్వలోక దారి

ద్ర్యంబు = ప్రపంచమునకంతయు లేమిడి- తనచావు = తనమృతి- జలప్రళయము = యుగప్రళయము- తనవలచినయదియె = తాను ప్రేమించిన స్త్రీయే- రంభ = మిక్కిలి చక్కనిది ఔన్ = అగును- తథ్యము = నిజము.

తా. తనభాగ్యమే దేవేంద్రపదవిగాను- తనదరిద్రమే ప్రపంచమునకంతటఁ గలిగిన లేమిడిగాను- తనచావే యుగప్రళయముగాను తానువలచిన స్త్రీయే మిక్కిలి (రంభతో సరిపోలు) చక్కనిదిగాను లోకులు తలంతురు.

క. తనవారు లేనిచోటను
జన వించుక లేనిచోట ♦ జగడముచోటన్
అనుమానమైనచోటను
మనుజునకును నిలువఁదగదు ♦ మహిలో సుమతీ. 52

టీ. సుమతీ- తనవారు = తనబంధువులు, లేనిచోటన్ = లేనిచోట- జనవు = మచ్చిక- ఇంచుక లేనిచోటన్ = కొంచమయినను లేనితావున- జగడముచోటన్ = కలహము చేసెడితావున- అనుమానము = సందియము- ఐన చోటన్ = అయినతావున- మహిలోన్ = భూమియందు- మనుజునకున్ = మనుష్యునికి- నిలువఁదగదు = వుండుట మంచిదికాదు.

తా. తన బంధువులు లేనితావునను- తనయెడ విశ్వాసములేని తావునను- జగడమాడెడు తావునను, తనపై సందేహమయిన తావునను- మనుష్యుడు వుండఁగూడదు

క. తమూలము సేయనినోరును
విమతులతోఁ జెలిమిసేసి ♦ వెతఁబడు తెలివిన్
గమలములు లేనికొలఁకును
హిమధాముఁడు లేనిరాత్రి ♦ హీనము సుమతీ. 53

టీ. సుమతీ- తమలము సేయని నోరును = తాంబూలము వేసుకోని నోరును- కుమతులతోఁ = తనమాటయందు నమ్మకము లేనివారితో- చెలిమి చేసి = స్నేహము చేసి- వెతబడు తెలివిన్ = దుఃఖమొందునట్టిహాని వివేకమును, కమలములు = తామరపువ్వులు, లేనికొలఁకును = లేనిసరస్సును- హిమధాముడు లేని రాత్రి = చందురుడు లేని రాత్రియు- హీనము = తక్కువయినవి.

తా. తాంబూలము వేయనినోరును- తనమాటయందు నమ్మకము లేని వారితో స్నేహము చేసి దుఃఖించు హాని వివేకమును- తామరలేని గుంటయు- చందురుడు లేని రాత్రియు నీచమయినవి.

క. తల నుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁక నుండు ♦ వృశ్చికమునకుఁ
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము ♦ గదరా సుమతీ. 54

టీ. సుమతీ- ఫణికిని = పామునకు- విషము = విసము- తలమందుఁ = శిరస్సునందుండును- వెలయంగాఁ = ఒప్పునట్లుగా- వృశ్చికమునకుఁ = తేలునకు- తోఁకఁ = తోకయందు- ఉండుఁ = ఉండును- తలతోఁకయనకఁ = తల తోక అనక- ఖలునకుఁ = దుర్జనునికి- నిలువెల్లఁ = శరీరమందంతయు విషము = విసముఉండును- కదరా = కాదా.

తా. శిరస్సునందు పామునకును- కొండెయందు తేలునకును- తలతోకయనెడి భేదములేక దుష్టునికి దేహమంతటను విషముండును.

క. తలపొడుగు ధనముఁ బోసిన
వెలయాలికి నిజము లేదు ♦ వివరింపంగాఁ

దల దడవి బాసఁ జేసిన
వెలయాలిని నమ్మరాదు ♦ వినురా సుమతీ 55

టీ. సుమతీ, తలపొడుగు = శిరస్సు పరిమాణము - ధనము = అర్థము- పోసినను = కుమ్మరించినను- వెలయాలికి = వేశ్యకు- నిజములేదు = సత్యము లేదు- వివరింపగాన్ = విస్తరించిచెప్పఁగా- తల = శిరస్సును-తడవి = తాఁకి బాస = పరిమాణము- చేసినన్ = చేసినప్పటికిని- వెలయాలిని = వేశ్యను- నమ్మరాదు = విశ్వసింపగూడదు.

తా. నిలువెత్తు ధనము కుమ్మరించినను వేశ్యకు సత్యము లేదు. తల మీఁద చేయినుంచి ప్రమాణముచేసినను వేశ్యను నమ్మరాదు.

క. తల మాసిన నొలు మాసిన
వలువలు మాసినను బ్రాఁతి ♦ వల్లభునైనం
గులకాంత లైన రోఁతురు
తిలకింపఁగ భూమిలోనఁ ♦ దిరముగ సుమతీ 56

టీ. సుమతీ- తిలకింపఁగన్ = అరసిచూడగా- భూమిలోనన్ = పుడమి యందు- తిరముగన్ = స్థిరముగా- తలమాసినన్ = తలమురికైనను- ఒలుమాసినన్ = శరీరము మురికైనను- వలువలు మాసినను = వస్త్రములు మాసినను- ప్రాణవల్లభునైనన్ = మగనినైనను- కులకాంతలు = భార్యలు - ఐనన్ = ఐనప్పటికిని- రోఁతురు = తిరస్కరింతురు.

తా. పుడమియందు ప్రాణనాయకుఁడైనను తలయు- దేహమును వస్త్రములును మురికైనయెడల భార్యలు తిరస్కరింతురు.

క. తా ననుభవింప నర్థము
మానవపతిఁ జేరుఁ గొంత ♦ మఱి భూగత మౌఁ

గానల నీఁగల గూర్చిన
తేనియ యొరుఁ జేరునట్లు ♦ తిరముగ సుమతీ. 57

టీ. సుమతీ- కానలన్ = అడవులయందు- ఈఁగలు = మక్షికములు- కూర్చిన = చేర్చినట్టి- తేనియ = తేనె- ఒరున్ = ఇతరునికి- చేరునట్లు = వశమైనట్లు- తాను- అనుభవింపని = ఉపయోగింపని- అర్థము = ధనము- తిరముగన్ = స్థిరముగా- మానవపతిన్ = రాజును- చేరున్ = చేరును. మఱి = మఱియును- గొంత భూగతమౌన్ = కొంత భూమిపాలగును.

తా. అడవియందు తేనెటీఁగలు కూడఁబెట్టిన తేనె, ఎట్లు పరులకుఁ జెందునో, అట్లు, తాను చేర్చిపెట్టినధన మనుభవింపనియెడల, ఆధనములో కొంత రాజుపాలగును, మఱి కొంత భూమిపాలగును.

క. దగ్గఱఁ గొండెము సెప్పెడు
ప్రెగ్గడపలుకులకు రాజు ♦ ప్రియుఁడై మఱి తా
నెగ్గు ప్రజ కాచరించుట
బొగ్గులకై కల్పతరువుఁ ♦ బొడుచుట సుమతీ. 58

టీ. సుమతీ. దగ్గఱన్ = సమీపమునందు, కొండెము = చాడి, చెప్పెడు = చెప్పునట్టి, ప్రెగ్గడ = మంత్రియొక్క, పలుకులకున్ = మాటలకు, రాజు = భూపాలుడు, ప్రియుండై = ప్రేమగలవాఁడై, మఱియు-, తాన్ = తాను, ప్రజకు = జనులకు, ఎగ్గు = కీడు, ఆచరించుట = చేయుట, బొగ్గులకై = అంగారములకై, కల్పతరువున్ = కోరినఫలములనిచ్చెడి దేవతావృక్షమును, బొడుచుట = నఱకుట.

తా. రాజు మంత్రి చెప్పునట్టి చాడీలకు ప్రియుఁడై విచారింపక జనులకు చెడుపు చేయుటయనునది. కోరినఫలముల నిచ్చెడి దేవతావృక్షమును బొగ్గులకుగాను నఱికివేయుటతో సమాన మగును.

క. ధనపతి సఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్ష ♦ మెత్తఁగ వలసెన్
దనవారి కెంత గలిగినఁ
దనభాగ్యమె తనకుఁ గాక ♦ తథ్యము సుమతీ. 59

టీ. సుమతీ, ధనపతి = ధనాధిపతియైన [కుబేరుడు,] సఖుఁడై = చెలికాఁడై, ఉండియున్ = ఉండియును, శివుడు = ఈశ్వరుఁడు ఎనయంగాన్ = ఒప్పునట్లుగా, భిక్షము = బిచ్చము, ఎత్తఁగాన్ = ఎత్తునట్లుగా, వలసెన్ = సంభవించెను. తనవారికి = తనతో సంబంధించిన వారికి, ఎంతగలిగినన్ = ఎంతయుండి నప్పటికిని, తనభాగ్యమె = తన యదృష్టము, తనకుకాక = అట్లుకాక, తథ్యము = నిజము.

తా. ధనవంతుఁడైన కుబేరుఁడు, ఈశ్వరునికి చెలికాఁడైయుండియు, తాను బిచ్చమెత్తవలసి వచ్చెను, కాఁబట్టి. తనువారి కెంత ధనముండినను, తమయదృష్టము ప్రకారమే తమకు జరగును.

క. ధీరులకుఁ జేయు మేలది
సారం బగునారికేళ ♦ సలిలముభంగిన్
గౌరవమును మరి మీఁదట
భూరిసుఖావహము నగును ♦ భువిలో సుమతీ. 60

టీ. ధీరులకున్ = వివేకులకు. చేయు మేలు = చేయునట్టి యుపకారము, అది = ఆ (మంచిమేలు). సారంబగు = మంచిరుచియగు నారికేళ = టెంకాయయొక్క, సలిలముభంగిన్ = నీరురీతిగా, గౌరవమును = మర్యాదయును. మఱి = మఱియు, మీఁదటన్ = తర్వాత, భూరి = గొప్పదైన, సుఖావహము = సుఖమును కలిగించు నదియును, అగును.

తా. టెంకాయచెట్టునకు నీరుఁబోసినయెడల, ఏపరికారము, అది తర్వాత మిక్కిలి రుచిగల జలము నిచ్చునో, అట్లు వివేకులకు చేసినసహాయము, పిమ్మట మర్యాదయును సుఖమును యిచ్చును.

క. నడవకుమీ తెరు వొక్కటఁ
గుడువకుమీ శత్రునింటఁ ♦ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నుడువకుమీ యొరులమనసు ♦ నొవ్వఁగ సుమతీ 61

టీ. సుమతీ, ఒక్కటన్ = ఒంటిరిగా, తెరువు = మార్గము నందు, నడవకుమీ = పోకుము, శత్రునింటన్ = విరోధుని యింటియందు, కూరిమి తోడన్ = స్నేహముతో, కుడువకుమీ = భోజనము చేయకుము, పరధనములన్ = ఇతరులకు ద్రవ్యమును, ముడువకుమీ = మూటఁగట్టియుంచుకొనకుము, ఒరుల = ఇతరుల, మనస్సు = హృదయము, నొవ్వఁగన్ = నొచ్చునట్లుగా, నుడువకుమీ = మాటలాడకుము.

తా. దారిని ఒంటరిగా నడచుటయు, విరోధునియింటఁ బ్రీతితో భోజనము చేయుటయు, యితరులధనము నుంచుకొనుటయు, యితరులమనస్సు నొచ్చునట్లు నడచుకొనుటయుఁ గూడదు.

క. నమ్మకు సుంకరి జూదరి
నమ్మకు మగసాలవాని ♦ నటు వెలయాలిన్
నమ్మకు మంగడివానిని
నమ్మకుమీ వామహస్తు ♦ నవనిని సుమతీ. 62

టీ. సుమతీ సుంకరిన్ = పన్ను తీయువానిని, జూదరిన్ = జూదగానిని, అగసాలవానిన్ = కమసాలవానిని, అట్టు = అట్లే, వెలయాలిన్ = వే

శ్యను, అంగడివానిన్ = సరకులమ్మువానిని, అవనిన్ = భూమియందు, వామహస్తున్ = ఎడమ చేతిపనివానిని, నమ్మకుము = విశ్వసింపకుము.

తా. అప్పుతీయువానిని జూదమాడువానిని, కమసాలిని, వేశ్యను సరకులమ్మువానిని, ఎడము చేతి …ఁ బనిసేయువానిని నమ్మకూడదు.

క. నయమునఁ బాలుం ద్రావరు
భయమునను విషమ్ము నైన ♦ భక్షింతురుగా
నయ మెంతదోసకారియొ
భయమే చూపంగవలయు ♦ బాగుగ సుమతీ 63

టీ. సుమతీ, నయమునన్ = మంచిమాటలచేత, పాలున్ = పాలునైనను, త్రాగరు = పానముసేయరు, భయమునను = భయపెట్టుటచేత, విషమున్ = విషమును, ఐనన్ = ఐనప్పటికిని, భక్షింతురు = మ్రింగుదురు, కాన్ = కావున, నయము = మంచితనము, ఎంతదోసకారియో = ఎంత దోసమును చేయునదియో, భయమే = బెదిరింపే, చూపన్ కన్ వలయున్ = కనఁబఱుపవలయును.

తా. మంచిమాటలతోఁ జెప్పినయెడలఁ బాలును త్రాగనివారుకూడ, భయముచేత విషమునైనను మ్రింగుదురు. కాఁబట్టి, మంచితనముతోఁ గాని పనులకు బెదరింపే జూపవలయును.

క. నరపతులు మేర దప్పిన
దిర మొప్పఁగ విధవ యింటఁ ♦ దీర్పరి యైనన్
గరణము వైదికుఁడైనను
మరణాంతక మౌను గాని ♦ మానదు సుమతీ. 6

టీ. సుమతీ, నరపతులు = రాజులు, మేరన్ = న్యాయముయొక్క హద్దు, తప్పినన్ = మీరినను, తిరము ఒప్పన్ కన్ = స్థిరముగా వెల్లకాలమును, విధవ = మగములేనిది, ఇంటన్ = గృహమునందు, తీర్పరియైనన్ = పెత్తనము చేయునదియైనను. కరణము = గ్రామలేఖకుఁడు, వైదికుడు = కర్మకుడైనను, మరణాంతికము = ప్రాణముపోవునంతటి సంకటము,ఔను గాని, మానదు = తప్పదు.

తా. రాజు న్యాయముయొక్క హద్దు దప్పినను, ఇంటియందు పెత్తనము చేయునది విధవయైనను, గ్రామకరణము వైదికుడైనను, ప్రాణముపోవునంతటి సంకటముసంభవించును.

క. నవరసభావాలంకృత
కవితాగోష్ఠియును మధుర ♦ గానంబును దా
నవివేకి కెంతఁ జెప్పినఁ
జెవిటికి సంకూదినట్లు ♦ సిద్ధము సుమతీ. 65

టీ. సుమతీ, నవరసభావాలంకృత = శృంగారము మొదలగు తొమ్మిదిరసముల చేతను, భావం = వానిభావముల చేతను, అలంకృత = అలంకరింపఁబడిన, కవితాగోష్ఠియును = పండితసమూహమును, మధురగానంబున = మనోహరమైన గీతములను, తాన్ = తాను, అవివేకికి = తెలివిలేనివానికి, ఎంతజెప్పినన్ = ఎంత చెప్పినను, చెవిటికిన్ = చెవిటివానికి, సంకు = శంఖమును- ఊఁదినట్లు = పూరించినట్లు, సిద్ధము = నిక్కము.

తా. శృంగారము మొదలగు తొమ్మిదిరసముల చేతను, వానియర్థముల చేతను, అలంకరింపబడిన విద్వాంసుల సమూహముయొక్క శ్రోతృత్వమును మనోహరమైన సంగీతమును, తెలివిలేనివానికెంతఁ దెలియఁజేసినను, చెవిటివానికి సంకువూదినట్లు నిరర్థకమే యగును.

క. నవ్వకుమీ సభలోపల
నవ్వకుమీ తల్లిదండ్రి ♦ నాధులతోడన్
నవ్వకుమీ పరసతితో
నవ్వకుమీ విప్రవరుల నయ ♦ మిది సుమతీ. 66

టీ. సుమతీ, సభలోపలన్ = సభయందు, తల్లి = జననితోడను, తండ్రి = జనకునితోడను, నాధులతోడన్ = యజమానునితోడను, పరసతితోన్ = ఇతరునిభార్యతోడను, విప్రవరులన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, నవ్వకుము = పరిహాసముచేయకుము. ఇది-, నయము = నీతి.

తా. తల్లిదండ్రులతోడను, యజమానునితోడను, పరస్త్రీతోడను బ్రాహ్మణశ్రేష్ఠులతోడను సభయందు, పరిహాసముచేయరాదు.

క. నీరే ప్రాణాధారము
నోరేరసభరితమైన ♦ నుడువుల కెల్లన్
నారే నరులకు రత్నము
చీరే శృంగార మండ్రు ♦ సిద్ధము సుమతీ. 67

టీ. సుమతీ, నీరే = జలమే ప్రాణాధారము = ప్రాణమునకు ఆధారము, నోరే = వాక్కే, రసభరితము = రసవంతము, ఐననుడువులకున్ = అయినట్టిమాటలకు, ఎల్లన్ = అన్నిటికిని, ఆధారము = స్థానము, నరులకున్ = మనుష్యులకు, నారే = స్త్రీయే, రత్నము = రత్నమువంటిది-మిక్కిలి అలంకారమైనది, చీరే = చీరయే, శృంగారము = అందము- అండ్రు = అనిచెప్పుదురు, సిద్ధము = నిక్కము.

తా. నీరే సకలజీవములు బ్రతుకుటకు ఆధారము. నోరే రసవంతములైనను మాటలకెల్లమూలము. సర్వజనులకు స్త్రీయేరత్నమువలె శ్రేష్ఠవస్తువును అలంకారమునైనది. మేలైనసింగారము వస్త్రమే.

క. పగ వల దెవ్వరితోడను
వగవంగా వలదు లేమి ♦ వచ్చినపిదపం
దెగనాడ వలదు సభలను
మగువకు మన సియ్యవలదు ♦ మహిలో సుమతీ. 68

టీ. సుమతీ, ఎవ్వరితోడను = ఎట్టివారితోడను, పగ = విరోధము, వలదు = కూడదు. లేమి = దరిద్రము. వచ్చినపిదపన్ = వచ్చినపిమ్మట-వగవంగాన్ = ఏడ్చుట, వలదు = కూడదు, సభలను = సభయందు, తెగన్ = ఖండితముగా. ఆడవలదు = మాటాడవలదు, మహిలోన్ = భూమియందు, మగువకున్ = ఆడుదానికి, మనసు = మనస్సును, ఇయ్యవలదు = ఇయ్యఁగూడదు.

తా. ఎవ్వరితోఁగాని పగ పెట్టుకొనుటయు, దారిద్ర్యము సంభవించినప్పుడు దుఃఖించుటయు, సభలో మొగమోటము లేక మాటలాడుటయు ఆఁడుదానికి మనసిచ్చుటయు- గూడదు.

క. పతికడకుఁ దన్నుఁగూర్చిన
సతికడకును వేల్పుకడకు ♦ సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతి మార్గము సుమతీ. 69

టీ. సుమతీ. పతికడకున్ = ప్రభువుదగ్గరకును- తన్నున్ = తన్ను కూర్చిన = ప్రేమించిన- సతికడకున్ = భార్యదగ్గరకును- వేల్పుకడకున్ = దేవునిదగ్గరకును. సద్గురుకడకున్ = యోగ్యుఁడైనగురువుదగ్గరకును, సుతుకడకున్ = పుత్రునిదగ్గరకును- మతిమంతులు = బుద్ధిమంతులు- రిత్తచేతులన్-వట్టిచేతులతో చనరు=పోరు- (ఇదినీతి)

తా. తనయధిపతిని- అన్న శ్రేష్ఠుని- యిల్లాలిని- దేవుని- గురుశ్రేష్ఠుని- కుమారుని- జూచఁబోవునపుడు వట్టిచేతులతోఁబోవరాదు.

క. పని సేయునెడల దాసియు
ననుభవమున రంభ మంత్రి ♦ యాలోచనలం
దనభుక్తియెడలఁ దల్లియు
ననఁదనకులకాంత యుండ ♦ నగురా సుమతీ. 70

టీ. సుమతీ- పని = గృహకృత్యము- చేయునెడలన్ = చేయునసమయమునందు- దాసియున్ = పనికత్తెయును- అనుభవమునన్ = భోగించునపుడు- రంభ = రంభయును. ఆలోచనలన్ = ఆలోచనములకు- మంత్రి = ప్రధానియును, తనభుక్తియెడలను = తనభోజన సమయమునందు - తల్లియున్ = కన్నతల్లియును, అనన్ = అనఁగ, తనకులకాంత = తనభార్య, ఉండన్ = ఉండుట, అగురా = అనుగదా.

తా. భార్య తనకుపనులుసేయునపుడు పనికత్తెవలెను, తానుభోగించునపుడు రంభవలెను, తనకు ఆలోచనముచెప్పునపుడు మంత్రివలెను, తనకు భోజనము పెట్టునపుడు తల్లివలెను ఉండవలయును.

క. పరనారీసోదరుఁడై
పరధనముల కాసపడక ♦ పరులకుహితుఁడై
పరులు దనుఁ బొగడ నెగడియుఁ
బరు లలిగిన నలుగ నతఁడు ♦ పరముఁడు సుమతీ. 71

టీ. పరనారీసోదరుఁడై = ఇతరస్త్రీలకు తోఁబుట్టినవాని వలెనుండువాఁడై, పరధనములకున్ = యితరుల ద్రవ్యమునకు, ఆసపడక = కోరక, పరులకు = ఇతరులకు, హితుఁడై = స్నేహితుఁడై, పరులు = ఇతరులు, తనుఁ

పొగడఁగ = తన్నుఁగొనియాడఁగా, నెగడక = అంగీకరింపక, పరులు = ఇతరులు, అలిగినఁగ = కోపగించినప్పుడు, అలుగని = కోపగింపని, అతఁడు = ఆపురుషుఁడు, పరముఁడు = ఉత్తముఁడు.

తా. పరస్త్రీలకు సోదరునివంటివాఁడు, ఇతరుల ధనమున కాసపడని వాఁడును, ఇతరులకు మిత్రుఁడును, పరులు స్తుతిచేసినపుడు అంగీకరింపనివాఁడును, పరులు తన్నుఁగోపించినపుడు తాను గోపింపకయుండువాఁడును ఉత్తముఁడు.

క. పరసతికూటమిఁ గోరకు
పరధనముల కాసపడకుఁ ♦ బరు నెంచకుమీ
సరిగానిగోష్ఠి సేయకు
సిరిచెడి చుట్టంబుకడకుఁ ♦ జేరకు సుమతీ. 72

టీ. పరసతి = ఇతరునిభార్యయొక్క, కూటమిఁగ = పొందును, కోరకు = ఆసింపకుము. పరధనములకుఁగ = ఇతరులయొక్క సొత్తులకు, ఆసపడకుము = అభిలషింపకుము. పరుని = ఇతరుని, ఎంచకుమీ = తలంపకుము. సరిగాని = తగని, గోష్ఠి = సాంగత్యము, సేయకుము = ఒనర్పకుము. సిరిచెడి = సంపదఁబోఁగొట్టుకొని, చుట్టంబు కడకుఁగ = బంధుగునొద్దకు, చేరకు = వెళ్ళకుము.

తా. పరస్త్రీలకాసపడుటయు, పరవిత్తమున కాసపడుటయు, ఇతరుల (తప్పుల) నెంచుటయు, ధనమునశించినతర్వాత బంధువులయొద్దకు వెళ్ళుటయు, సాటిలేనివారితో స్నేహము జేయుటయుఁ దగనిపనులు.

క. పరసతులగోష్ఠి నుండిన
పురుషుఁడు గాంగేయుఁడైన ♦ భువి నిందపడుఁగ

పరసతి సుశీల యైనను
బరుసంగతి నున్న నింద ♦ పాలగు సుమతీ. 73

టీ. పరసతులగోష్ఠిన్ = అన్యస్త్రీల కూటమియందు, ఉండిన = ఉండినట్టి, పురుషుడు = మగవాడు, గాంగేయుండైనన్ = భీష్మాచార్యుడైనను, భువిన్ = భూమియందు, నిందపడున్ = అపకీర్తినొందును. పరసతి = ఇతరుని భార్య, సుశీలయైనను = మంచిస్వభావముకలదైనను, పరుసంగతిన్ = ఇతరునిసాంగత్యంబున, ఉన్నన్ = ఉండెనేని, నిందలపాలగున్ = అపకీర్తిపాలగును.

తా. బ్రహ్మచర్యవ్రతముగల భీష్ముడైనప్పటికిని, అన్యస్త్రీలగోష్ఠినుండెనేని నిందబొందును. ఎంత మంచినడవడికగల యుత్తమురాలైనను పరపురుషునింట నుండినయెడల అపకీర్తినిబొందును.

క. ఒరు నాత్మఁదలఁచు సతి విడు
మఱుమాటలు పలుకుసుతుల ♦ మన్నింపకుమీ
వెఱ పెఱుఁగనిభటు నేలకు
తరుచుగ సతి యింటికేగఁ ♦ దగదుర సుమతీ 74

టీ. ఒరున్ = ఇతరుని, ఆత్మ = మనస్సునందు, తలచు = కోరుచున్నట్టి, సతిన్ = భార్యను, విడు = వదలుము-మఱుమాటలు = అడ్డుమాటలు, పలుకు = పలుకునట్టి, సుతులన్ = పుత్రులను, మన్నింపకుమీ = క్షమింపకుము. వెఱపు = భీతి, ఎఱుఁగని = తెలియని, భటున్ = సేవకుని, ఏలకుము = పాలింపకుము, తరుచుగన్ = మాటిమాటికి సతియింటికేగఁగన్ = భార్యయొక్క యింటికివెళ్లుట, తగదుర = సరికాదుగా.

తా. అన్యపురుషుని కోరెడి భార్యను విడువవలయును, ఎదిరించిమాట

లాఁడు కొమారులను కాపాడరాదు. భయపడని సేవకుని ఉంచుకొనందగదు పలుమఱు భార్యయింటికిఁ పురుషుఁడుబోరాదు.

క. పరులకు నిష్టము సెప్పకు
పొరుగిండ్లకుఁ బనులు లేక ♦ పోవకు మెప్పుడున్
బరుఁ గదిసినసతిఁ గవయకు
మెఱిఁగియుఁ బిఱుసైనహయము ♦ నెక్కకు సుమతీ 75

టీ. పరులకు = ఇతరులకు, ఇష్టము = సమ్మతము, చెప్పకుము- పొరుగిండ్లకున్ = ఇతరులగృహములకు, పనులులేక = కార్యములులేక, పోవకుము = పోవలదు. ఎప్పుడున్ = ఎల్లప్పుడును, పరుఁగదిసిన = ఇతరునిపొందిన సతిన్ = స్త్రీని, కవయకుము = పొందకుము ఎఱిఁగియు = తెలిసియు, బిఱుసైన = మోటుదనమైన, హయమును = గుఱ్ఱమును, ఎక్కకుము = ఆరోహింపకుము.

తా. నీయభిప్రాయమును ఇతరులకు జెప్పకుము. పనులులేక పొరుగిండ్లకుఁ బోవకుము. పరపురుషుని సాంగత్యముచేసిన భార్యను గూడకుము. మోటుదనముగల గుఱ్ఱమును ఎక్కకుము.

క. పర్వముల సతులఁ గవయకు
ముర్వీశ్వరుకరుణ నమ్మి ♦ యుబ్బకు మదిలో
గర్వింప నాలిఁ బెంపకు
నిర్వాహము లేనిచోట ♦ నిలువకు సుమతీ. 76

టీ. పర్వములన్ = పంచపర్వములయందు, సతులన్ = స్త్రీలను- కవయకుము = పొందకుము. ఉర్వీశ్వరుకరుణ = రాజులదయను- నమ్మి = విశ్వసించి- మదిలో = మనస్సున- ఉబ్బకుము = సంతోషింపకుము. గర్వింప =

గర్వించునట్లుగా- అలి=భార్యను, పెంపకు = సాఁకకును- నిర్వాహము లేని పో
టన్ = సాగుదల లేనితావునందు- నిలువకు=ఉండకుము.

తా. పంచపర్వములయందు స్త్రీలను పొందుట యును- ప్రభువులదయను
నమ్మి పంతసిల్లుట యును- భార్యకు చనువిచ్చుట యును - సాగుదలలేనిచోట
నుండుటయుఁ దగని పనులు.

క. పలుదోమి సేయువిడియము
తలఁగడిగిననాఁటినిద్ర ♦ తరుణులతోడన్
బొలయలుక నాఁటికూటమి
వెల యింతని చెప్పరాదు ♦ వినరా సుమతీ. 77

టీ. పలుదోమిసేయువిడియము = పండ్లుతోముకొనినవెంటనే
వేసికొనినతాంబూలమును, తలఁగడిగిననాఁటినిద్ర = తలంటుకొనిన- నాఁటి
నిద్రయును - తరుణులతోడన్ = స్త్రీలతో - పొలయలుక నాఁటికూట
మి = ప్రణయకలహము నాఁటి పొందును, వెల ఇంత అని చెప్పరాదు = విలు
వయొక్క మితిని చెప్పుటకు సాధ్యముకాదు.

తా. పండ్లుతోముకొనిన వెంటనే వేసికొనిన తాంబూలమును, తలం
టుకొనిననాఁటి నిద్రయును, పొలయలుకనాఁటిపొందును వెల లేనివి. అనగా
(విలువయొక్క మితిని చెప్పుటకు శక్యము లేనివి)

క. పాటెఱుఁగనిపతికొలువును
గూటంబున కెఱుకపడని ♦ కోమలిరతియున్
జేటెత్తఁ జేయు చెలిమియు
నేటికి నెదురీఁదినట్లు ♦ నెన్నఁగ సుమతీ. 78

టీ. పాటు = చేసెడిపనియొక్క కష్టమును, ఎఱుఁగనిపతి = తెలిసికొనని యధికారియొక్క, కొలువును = సేవకత్వమును, కూటంబునకుఁ = కూడికకు ; ఎఱుకపడని = తెలియఁబడని, కోమలి = స్త్రీయొక్క, రతియుఁ = పొందును, పేరెత్తక = మోమోటమిలేక, చేయు చెలిమియుఁ = చేయునట్టి స్నేహమును, ఏటికి = నదికి, ఎదురు = ఎదురుగ్గాని, ఈఁదినట్లు = ఈఁతగొట్టుచుఁబోవునట్లు, గదరా = గదా.

తా. సేవకుండు పడునట్టికష్టమును దెలిసికొనని ప్రభువుయొక్క సేవయు, సాంగత్యమునందాసక్తిలేని స్త్రీపొందును- మోమోటమిలేక చేయునట్టివాని చెలిమియును- ఏటికి అభిముఖముగా నీఁదుటవలెకష్టమును గలిగించును.

క. పాలను గలసినజలమును
  బాలవిధంబుననె యుండుఁ ♦ బరికింపంగాఁ
  బాలచవిఁ జెఱుచుఁ గావునఁ
  బాలసుఁడగువానిపొందు ♦ వలదుర సుమతీ. 79

టీ. పాలను = క్షీరమును- కలసిన = చేరినట్టి - జలమును = నీరును- పాలవిధంబునని = క్షీరము రీతిగానే- ఉండున్ = ఉండును- పరికింపంగాన్ = శోధించిచూడగా- పాల = క్షీరముయొక్క- చవిన్ = రుచిని- చెఱుచున్ = చెడునట్లుఁజేయును. కావునన్ = కాబట్టి- పాలసుడు = దుర్జనుడు- అగువాని = అయినవాని- పొందు = స్నేహము-వలదుర = కూడదురా.

తా. పాలలోఁగలసిననీరు పాలవలెనే యుండియు దాని రుచినిబోఁగొట్టునట్లే- దుర్జనునిసహవాసము గుణాతిశయములను జెఱుచును. కాఁబట్టి దుర్జనునితో స్నేహముకూడదు.

క. పాలసునకైన యాపద
  జాలింబడి తీర్పఁదగదు ♦ సర్వజ్ఞునకుఁ

దేలగ్నిఁబడఁగంబట్టిన
మే లెఱుఁగునె మీటుఁగాక ♦ మేదిని సుమతీ. 80

టీ. ఖలునకున్ = దుర్జనునికి, ఐన = కలిగిన - ఆపద = కీడు- తలఁపన్ = విచారమును- పడి = పొంది- తీర్పన్ = తొలగించుట- సర్వజ్ఞునకున్ = అన్నియును దెలిసినవానికిని. తగదు = కూడదు- తేలు = వృశ్చికము- అగ్నిన్ = నిప్పునందు- పడన్ కన్ = పడఁగా, పట్టిన = పట్టుకొనిన- మీటున్ = కుట్టును- కాక = కాని, మేలున్ = ఉపకారమును- ఎఱుఁగునె = ఎఱుఁగునా.

తా. తేలు నిప్పులోఁ బడునపుడు విచారమునొందిపట్టుకొన్న యెడల- అది అన్నియును దెలిసినవానిని సైతము మేలు నెంచక కుట్టును. దుర్జనునికిఁ గీడు తటస్థించిన యెడల- ఆకీడును తప్పించుటకు సహాయముఁ జేసినచోఁ గీడే గలుగును.

క. పిలువని పనులకుఁ బోవుట
గలయని సతిరతియు రాజు ♦ గానని కొలువున్
బిలువని పేరంటంబును
వలవని చెలిమియును జేయ ♦ వలదుర సుమతీ 81

టీ. పిలువని పనులకున్ = పిలువని కార్యములకు- పోవుట = ఏఁగుటయు- కలయని = మనసు కలియని- సతి = భార్యయొక్క- రతియున్ = పొందును- రాజు = భూపతి కానని = చూడని కొలువున్ = ఉద్యోగమును- పిలువని పేరంటంబును = పిలువకయే పెండ్లికి బంధువులయిండ్లకుఁ బోవుటయును- వలవని చెలిమియును = ప్రేమింపని స్నేహితమును- చేయువలదుర = ఒవరఁదగదురా.

తా. పిలువనికార్యములకుఁ బోవుటయు- మనసుగలియని దానితో సహవాసము చేయుటయు- రాజుకనుఁగొనని యుద్యోగమును- తన్నుఁబిలువక యుండియు తాను పేరంటములకు బోవుటయు- ప్రేమింపని స్నేహమును జేయఁదగదు.

క. పురికిని బ్రాణము కోమటి
వరికిని బ్రాణంబు నీరు ♦ వసుమతిలోనన్
గరికిని బ్రాణము తొండము
సిరికిని బ్రాణంబు మగువ ♦ సిద్ధము సుమతీ. 82

టీ. పురికిని = పట్టణమునకు-కోమఁటి = వైశ్యుఁడును- వరికిని = సస్యమునకు- నీరు = జలమును, వసుమతిలోనన్ = భూమియందు- కరికిని = ఏనుగునకు-తొండము = తుండమును- సిరికిని = సంపదకు-మగువ = స్త్రీయును- ప్రాణంబు = జీవము- సిద్ధము = నిశ్చయము.

తా. నగరమునకుఁ గోమటియును-పరిపయిరులకు నీరును, ఏనుఁగునకు తొండమును- ధనమునకు స్త్రీయును- ప్రాణమువంటి ముఖ్యవస్తువులు.

క. పులిపాలుఁ దెచ్చియిచ్చిన
నలవడఁగా గుండెఁ గోసి ♦ యఱచే నిడినం
దలపోడుగు ధనముఁ బోసిన
వెలయాలికిఁ గూర్మి లేదు ♦ వినురా సుమతీ. 83

టీ. వెలయాలికిన్ = భోగముదానికి- పులిపాలున్ = పెద్దపులియొక్క పాలను - తెచ్చియిచ్చినన్ = కొనివచ్చియిచ్చినను- అలవడన్ కాన్ =ఒప్పునట్లుగా- గుండెన్=గుండెకాయను- కోసి=ఖండించి అఱచేతన్=అఱచేతి

యందు- ఇడినన్ = ఉంచినను- తలపాడుగు = శిరస్సుపర్యంతము- ధనముల్ = ద్రవ్యమును పోసినన్ = కుమ్మరించినను- కూర్మి లేదు = విశ్వాసము లేదు.

తా. పులిపాలు దెచ్చి యిచ్చినప్పటికిని- గుండెకాయను గోసి యఱచేతిలో నుంచినప్పటికిని- నిలువంత ద్రవ్యముఁ బోసినప్పటికిని వేశ్యకు ప్రేమ యుండదు.

క. పెట్టినదినములలోపల
నట్టడవులనైన వచ్చు ♦ నానార్థములున్
బెట్టనిదినములఁ గనకపు
గట్టెక్కిన నేమి లేదు ♦ గదరా సుమతీ. 84

టీ. పెట్టినదినములలోపలన్ - పూర్వజన్మమున చేసిన దానము యొక్క ఫలకాలమందు- నట్టడవులనైనన్ = అరణ్యమధ్యమునయైనను- నానార్థములున్ = సకల పదార్థములును- వచ్చున్ = కలుగును- పెట్టనిదినములన్ = పూర్వజన్మమునందు ఈయని కాలములయందు- కనకపుగట్టున్ = బంగారుపర్వతమును- ఎక్కినన్ = ఎక్కినను- ఏమిలేదు = ఏమియును లభింపదు. కదరా = కాదా.

తా. పూర్వజన్మమునం దేవేళలో పరులకు దానము కావించితిమో- ఆవేళలోకి అంతయు లభించును గాని- పెట్టని వేళలందు బంగారుకొండనెక్కినను ఏదియు లభింపదు కదా.

క. పొరుగునఁ బగవాఁ డుండిన
నిరవొందఁగ వ్రాతకాఁడె ♦ యేలిక యైనన్
ధరఁ గాఁపు కొండె మైనను
గరణాలకు బ్రతుకు లేదు ♦ గదరా సుమతీ. 85

టీ. పొరుగునన్ = ఇంటిపరిశ్రాన- పగవాడు = విరోధి - ఉండినన్ = నివసించి యుండినను- ఇరవొందన్ కాన్ = ఒప్పునట్లుగా- ఏలిక = పాలకుడు- వ్రాతకాఁడే = వ్రాయ నేర్చినవాఁడే- వినన్ = వినను-ధరన్ = భూమియందు కాపు = పైరుపెట్టువాడు, కొండెమైనను = చాడీలుచెప్పువాఁడైనను- కరణములకు = గ్రామలేఖకులకు - బ్రతుకు = జీవనము. లేదు = కలుగదు- కదరా = కాదా.

తా. పొరుగున విరోధియుండినను పాలకుడు వ్రాయ నేర్చిన వాఁడైనను- రైతు చాడీచెప్పువాఁడైనను- గ్రామలేఖకులకు జీవనముండదు.

క. బంగారుఁ గుదువఁబెట్టకు
సంగరమునఁ బాఱిపోకు ♦ సరసుఁడవైనన్
అంగడి వెచ్చము లాడకు
వెంగలితోఁ జెలిమి వలదు ♦ వినురా సుమతీ. 86

టీ. బంగారున్ = బంగారమును- కుదువబెట్టుకుము = అప్పునకు బదులుగా నుంచకుము. సంగరమునన్ = యుద్ధమునందు, పాఱిపోకుము = తిరిగిపోకుము. సరసుడవైనన్ = వివేకము గలవాఁడవగుదు వేని- అంగడిన్ = బజారునందు- వెచ్చము లాడకుము- అప్పుతీయకుము. వెంగలితోన్ = వెఱ్ఱివానితో చెలిమి = స్నేహము-వలదు = కూడదు. వినురా = ఆలకింపురా.

తా. బంగారు తాకట్టు పెట్టుటయు - యుద్ధమునందు తిరిగిపోవుటయు- అంగడియందు అప్పుదీయుటయు- వెఱ్ఱివానితో స్నేహము చేయుటయుఁ దగనిపనులు.

క. బలవంతుఁడ నా కేమని
పలువురతో నిగ్రహించి ♦ పలుకుట మేలా

బలవరితమైన సర్పము
చలిచీమలచేతఁ జిక్కి ♦ చావదె సుమతీ. 87

టీ. బలవంతుఁడన్ = బలముగలవాఁడను. నాకు ఏమని = నాకేమి కొఱఁత యని- నిగ్రహించి = విరోధించి- పలుకుట = మాటలాడుట మేలా = లగ్గా- బలవంతము = బలముగలిగినది. ఐన సర్పము = ఐనట్టిపాము- చలిచీమలచేతన్ = ఒకవిధమైన చీమలచేత చిక్కి = తగులుకొని-చావదె = మృతిఁబొందదా?

తా॥ బలము గల పాము అయినప్పటికి చలిచీమలచేతఁ జచ్చునట్లు- బలముగలవాఁడు అనేకులతో విరోధించెనేని- వారిచే మడియును.

క. మండలపతిసముఖమున
మెండైనప్రధాని లేక ♦ మెలఁగుట యెల్లన్
గొండంతమదపుటేనుఁగు
తొండము లేకుండినట్లు ♦ దోఁచుర సుమతీ. 88

టీ. మండలపతిసమ్ముఖమునన్ = చక్రవర్తిసభయందు- మెండైనప్రధాని = సమర్థుఁడైన మంత్రి- లేక = మెలఁగుట = వర్తించుట- ఎల్లన్ ... అన్నియును- కొండ అంత మదపు ఏనుఁగు = పర్వతాకారముగలిగిన మదము గల యేనుఁగు. తొండములేక = తుండము లేక- ఉండినట్లు- తోచుర = కనఁబడునురా.

తా॥ కొండంతయెత్తుగల ఏనుఁగ తుండము లేనియెడల- ఎట్లు నిరర్థక మగునో- అట్లే- మంత్రిలేనియెడలచక్రవర్తియైనను నిరర్థకుఁడగును.

క. మంత్రి గలవాని రాజ్యము
తంత్రము సెడకుండ నిలుచుఁ ♦ దఱుచుగ ధరలో

మంత్రివిహీనుని రాజ్యము
జంత్రపుఁగీ లూడినట్లు ♦ జరుగదు సుమతీ. 89

టీ. మంత్రిగలవానిరాజ్యము = ప్రధానిగలవాని రాచరికము- తంత్రము = ఉపాయము- చెడకుండ = చెడిపోక, నిలుచును = ఉండును- తెలుచుగన్ = విశేషముగా ధరలోన్ = భూమియందు- మంత్రివిహీనునిరాజ్యము = ప్రధానిలేని రాజ్యము, జంత్రపుకీలు = యంత్రముయొక్కయిరుసు- ఊడినట్లు = వీడిపోయినట్లు, జరుగదు = నడువదు.

తా. మంత్రిగల రాజుయొక్క ప్రభుత్వము, అపాయముచెడకుండ జరుగుచుండును. యంత్రముయొక్క కీలుఊడినట్లుమంత్రిలేని రాజుయొక్క పాలనము జరుగనేరదు.

క. మాటకు బ్రాణము సత్యము
కోటకుఁబ్రాణంబు సుభట ♦ కోటిధరిత్రిన్
బోటికిఁబ్రాణము మానము
చీటికిఁబ్రాణంబు వ్రాలు ♦ సిద్ధము సుమతీ. 90

టీ. మాటకున్ = పలుకునకు- సత్యము = నిజమును- కోటకున్ = సాలమునకు- సుభటకోటి = మంచిసేనాసమూహమును. ధరిత్రిన్ = భూమియందు- బోటికిన్ = స్త్రీకి-మానము = లజ్జయు-చీటికిన్ = జాబునకు- వ్రాలును- ప్రాణంబు = జీవము.

తా. మాటకునిజమును- కోటకు మంచి సేనాసమూహమును, స్త్రీకి మానమును- జాబునకు వ్రాసినవానిచేవ్రాలును బ్రాణమువలె ముఖ్యమైనవి.

క. మానఘనుఁ డాత్మధృతి చెడి
హీనుం డగువాని నాశ్ర ♦ యించుట యెల్లన్

మానెడుజలములలోపల
నేనుఁగు మెయిదాఁచినట్టు ♦ లెఱుఁగుము సుమతీ. 91

టీ. మానఘనుఁడు = గొప్పమానముగలవాఁడు, ఆత్మక్ = హృదయమునందు- ధృతి = ధైర్యము- చెడి = తొలఁగి- హీనుండు అగువానిన్ = అల్పుఁడు ఐనవానిని- ఆశ్రయించుట = కొలచుట- ఎల్లన్ = అంతయును- మానెడుజలములలోపలన్ = కొంచెపునీళ్లలోపల- ఏనుఁగు = గజము. మెయిన్ (తన) దేహమును, దాఁచినట్లు = మఱుఁగుపఱచినట్లు- ఎఱుఁగుము = తెలిసికొనుము.

తా. గౌరవస్థుఁడు అల్పునియాశ్రయించుటయనునది రవంతనీళ్ళలో ఏనుగు దేహమును మఱుఁగు పఱచినట్లుండును.

క. రాపొమ్మని పిలువనియా
భూపాలునిఁ గొల్వ భుక్తి ♦ ముక్తులు గలవే
దీపంబు లేనియింటను
జేపుణికిళ్లాడినట్లు ♦ సిద్ధము సుమతీ. 92

టీ. రా = రమ్ము- పొమ్ము = అరుగుము- అని పిలువని = ఇట్లుపిలువని- భూపాలుని = రాజును- కొల్వన్ = సేవింపఁగా- భుక్తి = జీవనమును- ముక్తి = మోక్షమును- గలవే = ఉన్నవా(లేవనుట)- దీపంబు = దివ్వె- లేనియింటన్ = లేనిగృహమునందు- చేపుణికిళ్లు = బాలక్రీడలు, ఆడినట్లు = ఆడినరీతిగానే, సిద్ధము = నిజము.

తా. దీపములేని గృహమునందు గొబ్బిళ్ళాటయాడినయట్లు రమ్ము పొమ్మని యాదరణసేయని రాజువద్ద నుద్యోగము సేయుటవలన భుక్తియును ముక్తియును గలుగవు.

కం. రూపించి పలికి బొంకకు
ప్రాపగుచుట్టంబు నెగ్గు ♦ పలుకకు మదిలోఁ
గోపించు రాజుఁ గొల్వకు
పాపపు దేశంబు సొరకు ♦ పదిలము సుమతీ. 93

టీ. రూపించి = అగుపఱచి - పలికి = చెప్పి - బొంకకుము = అబద్ధముఁ జెప్పకుము. ప్రాపు = ఆధరువు - అగు = అగునట్టి - చుట్టంబును = బంధుగును - ఎగ్గుపలుకకు = కీడుఁ జెప్పకుము - మదిలోన్ = మనస్సునందు - కోపించు = కోపించుచుండును - రాజున్ = రాజును - కొల్వకు = సేవింపకుము. పాపపు దేశంబు = పాపులగు దుర్మార్గులుండు దేశమును - సొరకుము = ప్రవేశింపకుము. పదిలము = భద్రము.

తా. సాక్షులమూలమున రూపించినతర్వాత అబద్ధము చెప్పుటయు ఆప్తబంధువులను దూఱుటయు - కోపియగు రాజును గొలుచుటయు పాపులుండు భూమికేఁగుటయు కూడని పనులు.

కం. లావుగల వానికంటెను
భావింపఁగ నీతిపరుఁడు ♦ బలవంతుండౌ
గ్రావంబంత గజంబును
మావటివాఁ డెక్కినట్లు ♦ మహిలో సుమతీ. 94

టీ. గ్రావంబంతం = కొండంతటి - గజంబును = ఏనుఁగును - మావటివాడు = మావంతుఁడు - ఎక్కినట్లు = ఆరోహించినట్లు - మహిలోన్ = భూమియందు - లావు = శరీరదార్ఢ్యము - కలవానికంటెను = కల్గినవానికంటెను భావింపఁగన్ = ఆలోచింపఁగా, నీతిపరుఁడు = వివేకముకలవాఁడు - బలవంతుఁడు = బలముగలవాఁడు.

తా. పెన్గ యేనుఁగును మావటివాఁడు ఎక్కినట్లు బలముగలవానికంటెను నీతిపరుఁడే బలవంతుఁడు

క. వఱదైనచేను దున్నకు
కఱవైనను బంధుజనుల ♦ కడ కేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనము ♦ పెట్టకు సుమతీ. 95

టీ. వఱద = ఎన్లిన, ఐనచేను = ఐనట్టిపొలమును, దున్నకు = నాఁగలితో భేదింపకుము, కఱవు = క్షామము, ఐనను = సంభవించినను, బంధుజనులకడకు = చుట్టాలయొద్దకు, ఏఁగకుమీ = పోకుము. పరులకు = ఇతరులకు. మర్మము = రహస్యము, చెప్పకు = తెలియఁజేయకుము, పిఱికికి = భయముగలవానికి, దళవాయితనము = సేనాధిపతిత్వము. పెట్టకుము = ఉంపకుము.

తా. వర్గనమైన పొలముచు దున్నుటయు, దుర్భిక్షకాలమునందు బంధువులకడకేఁగుటయు, అన్యులకు రహస్యముచు జెప్పుటయు, ధైర్యహీనునికి సేనానాయకత్వము నొసంగుటయుఁ జేగనిపనులు.

క. నరిపంటలేనియూరును
దొర యుండని యూరుఁ దోడు ♦ దొరకని తెరువున్
ధరను బతి లేనిగృహమును
నరయంగా రుద్రభూమి ♦ యనఁదగు సుమతీ. 96

టీ. నరిపంట = వరిపైరు, లేనియూరును = లేనట్టిగ్రామమును, దొర = ప్రభువు, ఉండనియూరున్ = లేనియూరును, తోడు = సహాయము, దొరకని = లభింపని, తెరువున్ = మార్గమును, ధరను = భూమియందు, ప

తి = మగడు, లేనిగృహము = లేనట్టియిల్లును, అరయఁగాఁ గాఁ = ఆలోచిం పఁగా, రుద్రభూమి = వల్లకాడు, అనఁగ = అనుటకు, తగుఁ = ఒప్పును

తా. వరిపంటలేనియూరును, అధికారివసియింపని గ్రామమును, తోడు దొరకని బాటయును, యజమానుడులేని గృహమును వల్లకాటితో సమానము.

క. వినఁ దగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక ♦ వివరింపఁ దగుఁ
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు ♦ మహిలో సుమతీ. 97

టీ. ఎవ్వరుసెప్పినఁ = ఎవ్వరుచెప్పినను, వినఁదగు = ఆలంకిపవచ్చును. వినినంతనె = వినగానె- వేగపడక = తొందరపడక- వివరింపదగుఁ = ఆలోచింపవలయును, కని = చూచి- కల్ల = అబద్ధమానుటయు. నిజము = సత్యమనుటయు- తెలిసినమనుజుఁడె = తెలిసికొనినవాడె - నీతిపరుడు = న్యాయమెఱింగినవాడు.

తా. ఎవరు ఏది చెప్పినను- అపసరపడక నిజమిదియనియు - అబద్ధమిదియనియు- తెలిసికొనువాడే వివేకముగలవాడు.

క. పీఁడెము సేయనినోరును
నాడియు మఱిలేదటంచు ♦ నాడెడినోరున్
బాడంగ రానినోరును
బూడిద కిరువైన పాడు ♦ బొందర సుమతీ. 98

టీ. పీడెము సేయని = తాంబూలము వేసికొననినోరును - ఆడియు = చెప్పియు- మఱిలేదు అటంచున్ ఆడెడినోరున్ = పిమ్మట లేదని బొంకువట్టి నోరును- పాడన్ రాన్ = పాడుటకు- రాని = తెలియని - నోరును =

వాక్యాను- బూడిదను, ఇరవు=తనికిపట్టు- ఐన పాడుబొందర = ఐనట్టి ప్రయోజనము లేనిగొయ్యిరా.

తా. తాంబూలము వేయనట్టియు- మాటచెప్పి పిమ్మట లేదనునట్టియు, సంగీతముపాడుటకు తెలియనట్టియు అగునోరు బూడిదఁబోయునట్టి పల్లమువంటిది.

క. వెలయాలివలనఁ గూరిమి
గలుగదు మఱిఁ గలిగెనేని ♦ కడ తేఱదుగాఁ
బలువురు నడచెడు తెరువునఁ
బులు మొలవదు మొలిచెనేని ♦ పొదలదు సుమతీ. 99

టీ. పలువురు = అనేకులు- నడచెడుతెరువునన్ = నడచునట్టిదారియందు- పులు = పచ్చిక- మొలవదు = పుట్టదు- మొలిచెనేని = ఒకవేళ పుట్టెనేని- పొదలదు = వర్ధిల్లదు- వెలయాలివలనన్ = వేశ్యవలన- కూరిమి = ప్రేమ- కలుగదు = పుట్టదు- మఱి = మఱియును- కలిగెనేని = ఒక వేళ కల్గినను- కడతేఱదు = బహుకాలముండదు.

తా. అనేకులు నడచెడి మార్గమందు పచ్చిక మొలవనే మొలవదు. అట్లు మొలచినను (నశించిపోవును). అట్లే వెలపొలఁతికి స్నేహము కలుగ నేకలుగదు అట్లుకల్గినను స్థిరముగా నుండదు.

క. శుభముల నొందనిచదువును
నభినయమును రాగరసము ♦ నందనిపాటల్
గుభగుభలు లేనికూటమి
సభ మెచ్చనిమాట లెల్లఁ ♦ జప్పన సుమతీ. 100

టీ. శుభములన్ = మంగళములను- ఒందని = చెందని- విద్యయును = చదువును- అభినయమును = అర్థమనసారముగా అవయవవిన్యాసమును- రాగరసమున్ = సంగీతస్వారస్యమును- అందనిపాటల్ = లేనిపాటలను-గుభగుభలు = సంతోషాశ్చర్యములను దెలియఁజేయు శబ్దములు లేనికూటమి = లేనిసభయును- సభమెచ్చనిమాటలు = పదిమంది సంతోషింపనిమాటలును- ఎల్లన్ = ఇవియంతయు- చప్పన = సారములేనివి.

తా. మంచి నొందనటువంటి చదువును- అర్థము ననుసరించి అభినయమున- రాగమునందలి స్వారస్యమును లేవట్టిపాటయును- ఆశ్చర్య సంతోషశబ్దములు లేనిసభయును- పదుగురు మెచ్చని మాటలును సారములేనివి.

క. సరసము విరసముకొఱకే
పరిపూర్ణ సుఖంబు లధిక ♦ బాధలకొఱకే
పెరుఁగుట విఱుగుటకొఱకే
ధరదగ్గుట హెచ్చుకొఱకె ♦ తథ్యము సుమతీ. 101

టీ. సరసము = పరిహాసము- విరసముకొరకే = విరోధముకొరకే - పరిపూర్ణసుఖంబులు = అపరిమితమైన సౌఖ్యము- అధికబాధలకొఱకే = పెక్కుకష్టములకొఱకే- పెరుగుట = వృద్ధినొందుట- విఱుగుటకొఱకే = భగ్నమగుట కొఱకే- ధర = వెల- తగ్గుట = చౌకయగుట- హెచ్చుకొఱకే = అధికమగుటకొఱకే. తథ్యము = నిజము.

తా. హాస్యపు మాటలు విరోధమును కలిగించును. అపరిమితమైన సౌఖ్యములు పిదప చాలకష్టములను గలిగించును. అధికముగాఁ బెరుగునది విఱిగిపోవును. వెలతక్కువయగుట అధికమగుటకును కారణమగును.

క. మేలెంచని మాలిన్యుని
మాలను నగ సాలవాని ♦ మంగలి హితుగా

ఏలిన నరపతిరాజ్యము
నేలఁ గలసిపోవుఁ గాని ♦ నెగడదు సుమతీ. 102

టీ. మేలున్ = ఉపకారము- ఎంచని = తలంపని- మాలిన్యుని = మలినమైన మనస్సుగలవానిని- మాలను = చండాలుని- అగసాలవానిన్ = కమసాలవానిని- మంగలిన్ = క్షౌరకుని. హితులుగాన్ = స్నేహితులనుగా- ఏలిన = పాలించువాఁడైన- నరపతిరాజ్యము = రాజుయొక్క పాలనము- నేలఁగలసి పోవున్ = నశించిపోవును. కాని నెగడదు - అభివృద్ధిఁజెందదు.

తా. మంచి నెంచని పాపాత్ముని. మాలవానిని- కంసాలిని- మంగలిని స్నేహితులనుగాఁ జేసికొని రాజ్యము నేలువానియొక్క రాజ్యము నశించి పోవును.

క. స్త్రీలయెడ వాదు లాడకు
బాలురతోఁ జెలిమి చేసి ♦ భాషింపకుమీ
మేలైన గుణము విడువకు
మేలినపతి నిందసేయ ♦ కెన్నఁడు సుమతీ. 103

టీ. ఎన్నడున్ = ఎప్పటికిని- స్త్రీలయెడన్ = ఆడువారితో- వాదులాడకు తర్కముజేయకుము బాలురతోన్ = పిల్లకాయలతో- చెలిమి = స్నేహముచేసి భాషింపకుమీ = మాటలాడకుమీ- మేలైనగుణమున్ = మంచిగుణమును- విడువకుము = త్యజింపకుము. ఏలినపతిన్ = రక్షించినయజమానుని- నిందసేయకుము = దూషింపకుము.

తా. ఆఁడువారితోఁ దర్కించుటయు- పసిపిల్లకాయలతో చెలిమిచేసి మాటలాడుటయు- మంచిగుణమును విడుచుటయు, కాపాడినవానినిదూషిం

క. సిరిదా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ ♦ సలిలముభంగిన్
సిరి దాఁబోయినఁ బోవును
గరిమ్రింగిన వెలగపండు ♦ కరణిని సుమతీ. 104

టీ. సలలితముగన్ = రమ్యముగా- నారికేళసలిలము భంగిన్ = టెంకాయిలోని నీళ్లవలె. సిరి = సంపద- తాన్ = తాను- వచ్చినన్ = కలిగినను వచ్చును = కలుగును. కరి మ్రింగిన వెలగపండు కరణిన్ = ఏనుగుమ్రింగిన వెలగపండువలె- సిరి = సంపద- తాన్ = అది- బోయినన్ = బోయినను- బోవును = మాయమగును.

తా. కలిమివచ్చునప్పుడు టెంకాయయందు జలము వచ్చువట్లు ఎవరికినిఁ దెలియకవచ్చును. ఆసంపద నశించిబోవునపుడు ఏనుగుమ్రింగిన వెలగపండువలె లోపల ఏమియులేక పైపెంకుమాత్రముండునట్లు మాయమగును.

క. మది నొకని వలచి యుండఁగ
మదిచెడి యొకకూరవిటుఁడు ♦ మానక తిరుగున్
బఁది జిలుక పిల్లి పట్టినఁ
జదువునె యాపంజరమున ♦ జగతిని సుమతీ. 105

టీ. మదిన్ = మనస్సునందు- ఒకనిన్ = ఒకవిటుని- వలచియుండఁగన్ = కోరియుండఁగా- మది = వివేకము- చెడి = కప్పి- ఒకకూరవిటుడు = మరియొక కూరుడైనజారుడు - మానక = వదలక- తిరుగున్ = వెంట తిరుగుచుండును - చిలుక = చిలుకయొక్క పంజరమునందు - పిల్లి = మార్జాలము- పట్టినన్ = నివసించిన -ఆపంజరమునన్ = ఆగూటి యందు, చదువునె = మాటలాడుటకు నేర్చుకొనునా.

తా. చిలుకపంజరములోఁ బిల్లియుండఁగా- చిలుక మాటలకై ఒకజారుని కోరియున్న స్త్రీని మఱియొకవిటకాఁడు ఎంతబ్రతిమాలినను వశ్యురాలు కానేరదు.

క. పుత్త్రోత్సాహము తండ్రికిఁ
బుత్త్రుఁడు జన్మించినపుడె ♦ పుట్టదు జనులా
పుత్త్రునిఁ గనుఁగొని పొగడఁగఁ
బుత్త్రోత్సాహంబు నాఁడు ♦ పొందుర సుమతీ. 1(

టీ. తండ్రికిన్ = జనకునికి- పుత్త్రుఁడు = కొమరుఁడు- జన్మించినపుడె = పుట్టినపుడె- పుత్త్రోత్సాహము = కొమరునిగన్న సంతోషము - పుట్టదు = కలుగదు- జనులు = మనుష్యులు- పుత్త్రునిన్ = కొమరుని- కనుఁగొని = చూచి. పొగడఁగ = మెచ్చుకొనఁగా - పుత్త్రోత్సాహంబు = కొడుకుయొక్క సంతోషము- నాఁడు = ఆదినమునందు- పొందుర = పొందునుగదా.

తా. తండ్రికిఁ గొడుకు పుట్టగానే సంతోషము కల్గదు గాని-కొమరునిఁజూచి లోకులు మెచ్చునపుడు సంతోషము పుట్టును.

క. వేసరపుజాతి గానీ
వీసముఁ దాఁ జేయనట్టి ♦ వెంగలి గానీ
దాసికొడుకైనఁ గానీ
కాసులు గలవాఁడె రాజు ♦ గదరా సుమతీ. 107

టీ. వేసరపుజాతి = సంకరజాతి, కాని=ఐనప్పటికిని, వీసము=కొంచెమైనను తాన్ = తాను, చేయనట్టి = చేయనట్టి, వెంగలికానీ = పిచ్చివాఁడు గాని- దాసికొడుకు= దాసికొడుకు- ఐనకానీ = ఐనప్పటికిని- కాసులు గలవాఁడె = ధనముగలవాఁడె- రాజు కదరా = రాజుకాదా.

తా. సంకరజాతియందుఁ బుట్టినవాఁడైనను నిష్ప్రయోజకుఁడైనను-దాసికత్తె కొడుకైనను ధనముఁగలవాఁడే ప్రభువు.

సమాప్తము.

| | | | |
|---|---|---|---|
| శతకము- టీకాతాత్పర్య సహితం. | | | 0-3-0 |
| క. శతకము | డిటో | | 0-8 0 |
| రశతకము | డిటో | | 0-5-0 |
| సబోధశతకము | డిటో | | 0-4-0 |
| రధీశతకము | డిటో | | 0-5-0 |
| రామాయణము | డిటో | | 0-3 0 |
| బరీషోపాఖ్యానము | డిటో | | 0 3-0 |
| ోపాఖ్యానము | డిటో | | 0-8-0 |
| చేలోపాఖ్యానము | డిటో | | 0-4-0 |
| రుక్మిణీకల్యాణము క్యాలికో బైండు | డిటో | | 0-12-0 |
| గజేంద్రమోక్షము | డిటో | డిటో | 0-12-0 |
| ఆంధ్రనిఘంటుత్రయము | డిటో | డిటో | 1-0-0 |
| సప్తమస్కంధము | డిటో | డిటో | 1-8-0 |
| రాఘవపాండవీయము | డిటో | డిటో | 2 0 0 |
| శృంగారనైషధము | డిటో | డిటో | 8-8-0 |
| మనుచరిత్ర | డిటో | డిటో | 2-4-0 |
| వసుచరిత్ర | డిటో | డిటో | 4 0 0 |
| నరసింహశతకము మూలము | | | 0 2-0 |
| కాళహస్త్రీశతకము | ,, | | 0-2-0 |
| దేవకీనందనశతకము | ,, | | 0 2-0 |
| తాడిమళ్ళశతకము | ,, | | 0-2-0 |
| శవిచోదప్పశతకము | ,, | | 0-2-0 |
| కృష్ణశతకము | ,, | | 0-2-0 |

మాదేటి సన్యాసయ్య

ఆంధ్రబుక్కుడిపో,

